





# నాటకాలు

## భక్తి,జ్ఞాన,పురాణ,జానపద

# చిరుతల వీరాభిమన్య





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020010004734

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.
A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name
A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year
1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject
Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language
Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# చిరుతల
# పద్మవ్యూహము
## వీరాభిమన్యయుద్ధము



## ★ కొండా శంకరయ్య ★

సికింద్రాబాద్ - హైదరాబాద్ జి. వరంగల్.

శ్రీ పరమేశ్వరాయనమః



# చిరుతల - వీరఅభిమన్యు

అను

# పద్మవ్యూహము

ఇయ్యది

శతాధిక గ్రంథకర్త

శ్రీయుత

## చెర్విరాల భాగయ్యగారిచే

రచియింపబడినది



ప్రకాశకులు:

## కొండా శంకరయ్య

సికింద్రాబాద్ - హైద్రాబాద్ &. వరంగల్.

1956



వెల 1-0-0

## ఇందు వచ్చు పాత్రధారులు



| పురుషులు | స్త్రీలు. |
| --- | --- |
| దుర్యోధనుడు | సుభద్ర |
| శకుని | ఉత్తర |
| దుశ్శాసనుడు | ద్రౌపది |
| కర్ణుడు | దుస్సల |
| కృపాచార్యుడు | చెలి |
| అశ్వత్థామ | |
| సైంధవుడు | |
| ద్రోణాచార్యుడు | |
| అభిమన్యుడు | |
| ధర్మరాజు | |
| భీముడు | |
| అర్జునుడు | |
| శ్రీకృష్ణుడు | |
| ఘటోత్కచుడు | |

---

## హెచ్చరిక



శ్రీ పరమేశ్వరాయనమః



# చిరుతల - పద్మవ్యూహము.

---

కం॥ శ్రీశైలాగ్ర నివాసుని
పాకాసుర వైరినుతుని । పార్వతినాథుఁ
రాకాసుధాంశుమౌళిని
సాకల్యము నామనమున । సన్నుతి జేతుఁ॥



## గణపతి స్తవము.

దరువు॥ రారాశ్రీ గణనాయక । రాజానన శుభదాయక ॥రా॥ మారకోటిసమసుందర । భూరి సత్కరుణాకర ॥రా॥ హర గిరిజావరనందన । వరదా దురితవిదారణ ॥వ॥ సురముని వందితచరణా । సుఖకర మూషకవాహన ॥రా॥ నిర్విఘ్నముగను నీవిక । నెరవేర్పుము నాకోరిక ॥నె॥ యుర్విశ్రీమధురాపురి । సజ్జన పరిపాలక ॥రా॥



## సరస్వతీ స్తవము

దరువు॥ శ్రీసరస్వతీ నినునా । చిత్తమందు దలచెదాను ॥చి॥ వాసిగ దయసేయుమునా । వాంఛలెల్ల దీరగాను ॥శ్రీ॥ రవిగానని చోటు

నీవు । కవివరులకు జూపెదావు ॥క॥ నవరసవాక్యంబులిచ్చి । ప్రవిమలమతి. నన్ను బ్రోవు ॥శ్రీ॥ వీణాపుస్తక పల్లవ । పాణీ పరమేష్ఠిరాణి ॥పా॥ మాణిక్యాంచితగాత్రి । మనసను నిను శుభచరిత్రి ॥శ్రీ॥ భాసురమైనట్టి మశురబాదలోన విలసిల్లి ॥బా॥ వాసిగ నీభక్తవరుల వరుసతో రక్షించుతల్లి ॥శ్రీ॥

గురుస్తుతి

సీ॥ కడుప్రేమతో నన్ను । గని పెంచినట్టినా
జనయిత్రి జనకుల । సన్నుతింతు
అక్షరస్వీకార । మాది విద్యనునేర్పు
గురు బసవాఖ్యునే । కోరి దలతు
ఆసీర్వదించిన । న్నాదరించిన యట్టి
శంకరస్వామికే । శరణుజేతు
లక్షణశాస్త్రంబ । పేక్షతో గరపిన
హనుదాచార్యుల । నభినుతింతు
పారమార్థికబోధ । పరచిన శ్రీమాలె
పుల్లయార్యులపాద । ములభజింతు
గీ॥ కాళిదాసాది సంస్కృత । కవుల దలతు
ఆధునిక సత్కవీందుల । నాత్మనెంతు
పరమభాగవతోత్తమ । పండితులకు
వందనం బాచరింతునా । వాంఛదీర ॥

సం-వ॥ ఇష్టదేవతాభివందనం బాచరించి సద్గురుపుంగవుల పాద పద్మంబు లెదలో స్మరించి నాయొనర్పంబూనిన శ్రీమహాభారతాంతర్గత పద్మవ్యూహంబను యక్షగాన ప్రబంధంబునకు కథాక్రమంబెట్టిదనిన.

దుర్యోధనుడు ప్రవేశము

దరువు॥ దుర్యోధన నామముండనురా గాం । భీర్యాంచిత హృదయుం డనురా । ధైర్యశౌర్య ఐశ్వర్యవంతుడను । సూర్యతేజుడను శుభగాత్రుండను ॥దు॥ జనకుడు ధృతరాష్ట్రుండునురా మ । జ్జననియు గాంధారియు వినరా । ఘనభుజవిక్రములును నా మనుజులు । యనిలోపల పుర

హారు నెదిరింతురు ॥దు॥ కరిపురమును పాలింతునురా వి । క్రమమున వైరుల ద్రుంతునురా । ధరవసుశురాపురి ధాముడైనయా । స్మరహారు నెప్పుడు స్మరియించెదమది ॥దు॥

మాటలు॥ ఒరేఒరే హస్తినాపురంబును పాలించు ధృతరాష్ట్ర మహీపాలుని జ్యేష్ఠకుమారుండను. అష్టైశ్వర్య సంపన్నుడను. అరివీర భయంకరుడను. అద్రిధీరుండను. అసమాన సుందరాకారుండను. భాను మతీ మనోహరుండను. మన్నామంబు దుర్యోధనుండని యందురు వారి విను కోరి. (ఔను సరేకాని)

సీ॥ ఏలరాడాయె మామామ । యింతవరకు
బిలువనంపగ తనజాడ । దెలియదయ్యె
యేమిసేయుదు మామ పి । తామహుండు
మహినొరంగెను చంచల । మందె మనసు ॥

వ॥ మాభీష్మపితామహుండు రణాంగణమందు పడిపోయిననుండి నాకధైర్యమావటిల్లినది. మామాగారువచ్చినచో సర్వసైన్యాధిపత్య మెవరికీయవలెనో విచారించు చుంటినిగదా (అని యిటులనుకొను చున్నంతలో)

శకుని ప్రవేశము

దర్వు॥ గాంధారేయుల మేనమామనురా । మందరాద్రి ధీరుండ నురా । బంధురవసుగు భుజబలముతో మాపరి । వంధి జనుల బరిమార్చె దరా ॥గాం॥ యింద్రజాల మాహేంద్రజాలములనెంతయు నేపేర్వడసితిరా। చంద్రసూర్యుల కన్నుల మూసెటి । శకుని నామధేయుండనురా ॥గాం॥ దుర్యోధన దుశ్శాసనాదులకు । కార్యాలోచన దెల్పెదరా । శౌర్య మానసూలై పాండవుల । కడతేర్చగ దలపెట్టితిరా ॥గాం॥ అవనిలో వెలసిన యట్టిమశురపురి । యథవునినామది దలచెదరా । దివిజులుబొగ డగ దిక్కరులదరగ । ధీరత్వంబున వచ్చితిరా ॥గాం॥

మాటలు॥ గాంధార దేశాధీశ్వరుండను గాంధారిదేవి సహోద రుండను ఇంద్రజాల మహేంద్రజాల విద్యలలో నారితేరినవాడను దుర్యోధ

నాదుల హితవుగోరెటివాడను. మన్నామంబు శకుని యందురు దూతా వినయవిఖ్యాత. (అని యిటులనుచున్నంతలో దుర్యోధనుడరుదెంచును)

దు-వ॥ మామా నీకిదే వందనములు నీతోనొకటి యాలోచింప వలసియుండుటచే ఇంతవరకు నీరాకకై యెదురిచూచుచుంటిని.

శ - వ॥ నీవు నాతో యాలోచింపవలసినది సేనాధిపత్యము గురించేనా.

దు - వ॥ ఔను.

వాద - దర్వు

దు॥ మామా గాంగేయుడైతె। మరణించెను రణమునందు ॥ మ ॥ నా మదిలో ధైర్యముపిడనాడినాడ నేమనందు ॥మా॥

వ॥ భీష్మపితామహుండు రణమందు బడిపోవుటచే నాధైర్యము బొత్తిగా తొలగిపోయినది. ఇప్పుడిక సేనాధిపత్య మెవరికీయ వలెనో తోచుటలేదు.

శ॥ తొందరపడబోకు నీకు । దోచినటుల సేయుమయ్యా ॥ తో ॥ యిందరు రణవీరులుండ । నేలనిట్లు గుందెవయ్యా ॥ తొం॥

వ॥ దుర్యోధనా ఏలయిట్లు చింతిల్లుచుంటివి. ఒక పితామహుండు బడిపోయినంత మాత్రమున నేమయ్యెను మన ధనురాచార్యుడు లేడా కర్ణుడు లేడా వీరిలో నెవరికైన సేనాధిపత్య మీయకూడదా.

దు॥ యిరువురిలో నెవ్వరికిని । యీయవలెనా నీవే తెల్పు ॥యీ॥ సరిగా యోచించినీదు । సద్దయనాయందునిల్పు ॥యి॥

వ॥ మామా ద్రోణాచార్యుం డఖిలాస్త్రవిద్యలో నారితేరినవాడు. రాధేయుడుగూడా నట్టివాడే కావున యీయిరువురిలో నెవరి నెన్నుకోవలెనో నీవే తెల్పుము.

శ॥ గురుడంతటివాడె కాని । కొద్దిగ నర్జునునిపైన ॥ కొ ॥ కరుణ జూప గలడటంచు । వెరపుదోచె నామనమున ॥ గు ॥

వ॥ దుర్యోధనా నీవన్నటుల గురుడు మహాసామర్థ్యము గల్లవాడే కాని కాస్త అర్జునునిపై యాతని కభిమానముండక పోదని నాకనుమాన మగుచుండెను.

దు॥ తానుండగ కర్ణునకే । తగునని యధికారమిడిన ॥త॥ మానసమున
నొచ్చుకొనడె । మామాయిది ధర్మమౌన ॥తా॥
వ॥ మామా గురుని కాదని కర్ణునకు సర్వ సైన్యాధిపత్య మిచ్చి
నచో గురుడు తనమదిలో నేమనుకొనునోగదా.
శ॥ సరెసరె యిపుడేటికినా । సంగతి నాలోచింతము ॥ సం ॥ ధర మశురా
పురివెలసిన । ధవళాంగుని స్మరియింతము ॥స॥
వ॥ సుయోధనా ఆసంగతి తర్వాత జూచుకోవచ్చునుగాని ప్రస్తు
తము నీకు యుద్ధము సాగింపవలయుననే యున్నదా.

దు-వ॥ మామా ఎందుకట్లు విచారించుచుంటివో కాని తెలియ
కుంటిని.

శ-వ॥ ఆపాండువులను వంచించుటకు యుద్ధమే కావలయునా వేరు
సాధనము లేదా.

దు-వ॥ మామాఅటులైతే వారినెట్లు గెలువవచ్చునో వెంటనే
చెప్పి పుణ్యముం గట్టుకొనుము.

శ-వ॥ చెప్పేదేమున్నది.

కం॥ నేచెప్పేదేమున్నది
నాచేతిలో పాచికలును । నయముగ నుండగ్
యోచించెద వెందులకిటు
రాచరికము నీకె దక్కు । రాజేంద్రసుతా ॥
వ॥ వింటివిగదా నాచేత యక్షములుండుట నీవెరింగినదే కదా.

దు-వ॥ ఔనుగాని మామా ఆ ద్యూత ప్రియుడగు ధర్మజుండు
మనకు ఒంటరిగ జిక్కినచో గదా నీవనుకున్న కార్యము పొసగుట
కవకాశముండును.

శ-వ॥ చిక్కకేమి నీవు నేనన్నట్లు జేయుము అదేమన.

గీ॥ పాండవాగ్రజున్ని । బట్టి తెచ్చినయట్టి
వానిమెచ్చినేను । వైభవముగ

సర్వజనులు బాగుడ । సైన్యాధిపత్యంబు
నిత్తునంచు వెల్ల । డించుమయ్య ॥

వ॥ పాండవాగ్రజుని బట్టితెచ్చినవానికే సైన్యాధిపత్యమిచ్చెదనని నిండుసభాంతరంగంబున వెల్లడిజేయుము అట్లుజేసినచో నీతలంపు తప్పక నెరవేరును.

దు-వ॥ శభాస్ మామా యుక్తియనసీదే యుక్తితప్పకఅటులే గానించెదను రమ్ముమనశిబిరమునకుజేరబోవుదము(అనివెళ్ళిపోయినంతలో)

దుశ్శాసన, కర్ణ, కృపా శ్వత్థామ, సైంధవులు
ప్రవేశము — దర్వు.

దుశ్శా॥ దుర్యోధను ప్రియతమ్ముడరానే । దుశ్శాసన నామండనురా ।
ధైర్యస్థైర్యంబులలోనావలె । ధన్యుండును లేడికవినరా ॥

వ॥ ధృతరాష్ట్ర మహారాజుగారి ద్వితీయకుమారుండను దుర్యోధనుని యాజ్ఞాధారకుండను భుజవిక్రముండను మన్నామంబు దుశ్శాసనుడని యందురు వారీ వినుకోరి.

కర్ణ॥ ఘనతర భుజవిక్రముడనురానే । కర్ణుండనువాడను వినరా । యినుని వరంబున జన్మించితి యీా । వనజభవాండమువణకును ననుగన ॥ఘ॥

వ॥ ఒరేఒరే సూర్యవరంబున జన్మించిన వాడను ధనుర్విద్యలో అరితేరినవాడను నన్ను కర్ణుండనియందురు. దూతావినయ విఖ్యాత.

కృపా॥ కృపాచార్యుడనె వాడనురా నే । క్షపాకరుని సమతేజుడరా । సుపర్వాణపతి వినతుండను మహా । సుగుణుండనుభుజ బలుడనురా ॥కృ॥

మాటలు॥ ఈపృథ్వీతలంబున యఖిలవిద్యలలో పేరెన్నికంగాంచిన కృపాచార్యుండనువాడను వారీ సూత్రధారీ.

అశ్వ॥ అశ్వత్థామనువాడనురానే । యరివీరభయంకరుడనురా । విశ్వము లోగల వీరులందరిలో । శాశ్వతకీర్తిని సంపాదించితి ॥అ॥

వ॥ ఒరేఒరే ద్రోణాచార్యులవారి ప్రియపుత్రుండను అస్త్రశస్త్ర

విద్యాలయందారితేరిన వాడను మన్నామంబు అశ్వత్థామ యని యందురు. వీరెవా సారధీ,

సైంధ॥ సింధుభూనతిని నేనురా । సైంధవ నామాంకితుడనురా । కంద ర్పుని సమసుందరాంగుడను । కదనరంగవిజయుండన వెలసితి ॥సిం॥

మాటలు॥ సింధు దేశాధీశ్వరుండను అవక్ర విక్రమ పరాక్రముం డను మన్నామంబు సైంధవుడని యందురు దూతా వినయవిఖ్యాత.

దుశ్శా॥ అరివీరభయంకరులమురా । యద్రిధీరులము మేమినరా । ధర మశురాపురి ధాముడైనయా । పరమశివునిమది బ్రస్తుతిజేతుము

సం-వ॥ అనియిటులనుచున్నంతలో దుర్యోధనుండరుదెంచి కర్ణా దులతో నేమనుచున్నాడన,

దుర్యో-వ॥ మిత్రమా కర్ణా.

వాడం - దర్వు

దుర్యో॥ ఎటుబోయితివి । రా । ధేయానీవింతవరకు ॥నె॥ యిటునీకొరకై నేబహు యెదిరిచూచుచున్నవాడ । కటకటనను విడచియొక్క ఘడియైనను యుండవుగద ॥ ఎ ॥

వ॥ కర్ణా నీవెక్కడికేగియుంటివి యిప్పటివరకు నీరాకకై నేనెంతయో యెదిరిచూచుచుంటిని.

కర్ణు॥ కురుకులేశ్వరా । నీ । కరుణకెంతో ముదమొందితి ॥కు॥ సురనది తనయుని భక్తితొజూడగోరి వెళ్ళితి యా । పరమ పవిత్రునియా జ్ఞను ఎడసియు నిటునరుదెంచితి ॥ కు॥

వ॥ మహారాజా నేనీ పదిదినంబు లెవరికతంబున శస్త్రము దాల్ప కుంటినో అట్టిభీష్మ పితామహుని దర్శించి సమరమ్మునకనుజ్ఞ నిమ్మని యడుగుటకై బోయివచ్చితిని.

దుర్యో॥ సరెమెచ్చితినీ ।నీ। గురుభక్తికి నామనమున ॥స॥ ధరలోనీవెరుగని మరియాదనున్నదేకర్ణా । గురుతరభుజబలుడవు నినుగానియాడగ నేరి తరము ॥స॥

వ॥ కర్ణా అట్టులైన పితామహుండేమని చెప్పెనో తెల్పుము.

కర్ణ॥ చెప్పెనుబహుగా । రణ । మొప్పదు యొప్పదటంచును ॥ చె ॥ యి
వ్వటికినిపాండవులతో యెంతకైనగానిమీారు । చప్పుడుగాకుండ సంధి
కొప్పుకొనిన మేలటంచు ॥చె॥

వ॥ ఇప్పటికిన్ని పాండవులతో సంధిజేసికొనిన మేలగునని పితా
మహుండు నొక్కివక్కాణించెను.

దుర్యో॥ అందుకు నీవూ । యే । మంటివొరా ధేయుడెల్పు॥ ॥మం॥ పాం
డుగా సుయోధనూడు భువిపిబ్రిదికియున్నవరకు । సంధిజేసుకొన
బడదని । చక్కగవచియింపలేద ॥అం॥

వ॥ మాసుయోధనుని కంఠమున ప్రాణములున్నవరకు యీామాట
నెన్నటికిని బొసగనేరదని చెప్పకపోయితివా.

కర్ణ॥ యీారకుందునా । యో । కౌరవేంద్రయటులాడక ॥నూ॥ ధారుణి
శ్రీమశురబాద ధవళాంగుని కరుణయున్న । పోరులోన పాండవులను
ధీరతో జయించగలము ॥యూ॥

గీ॥ చేతగానట్టివారలు । భూతలమున
సమరమన్నను భయముచే । సంధికోరకు
పాల్పడెరుగాని వీరులు । భయములేక
పోరుకే నిల్చెదరు సంధి । గోరరెపుడు.

వ॥ మహారాజా సంధికొప్పుకొనుట పిరికిపందల పనిగాని నావంటి
వీరునిపనిగాదు. (అనిన అశ్వత్థామ దుర్యోధనునితో)

అశ్వ-వ॥ సుయోధనా అట్లుగాదు.

కం॥ కలహామె కల్యాణంబని
యిలలో నీచాత్ములిచ్చ । యింతురు ప్రాజ్ఞుల్
వలనొప్ప సంధిగోరెరు
బలమున్నదటంచు నిట్లు । బలుకుట దగునా॥

వ॥ కావున నీచాత్ములే కలహామును గోరుచుందురుగాని సజ్జను
లట్లుగాక సంధినే గోరుచుందురు.

కర్ణ-వ॥ ఏమీా యేమంటివీ

వాదం - దరువు

కర్ణు॥ ఎవనియుప్పు దినుచునీవు । యెవనిమేలు గోరెదావో ॥ యె॥ బవర
మునకు వెరచినీవు । బాపడ నిటుబల్కెదావో ॥బా॥

వ॥ ఓ బాపడా నీవు యుప్పుదిన్నవానిని విడచిపెట్టి శతృపక్షము
వారికి మేలు జేయజూచుచుంటి హా చాలు నోరుమూయుము.

అశ్వ॥ అంతటియుపకారివై తె । నాలమునకు రాక నీవు ॥ అ ॥ యింతవరకు
యింటిలోన । యెందుకు గూర్చుంటివీవు ॥యెం॥

వ॥ ఓహో నీవు ప్రభువుమేలు గోరినవాడవే యైనచో యింతవర
దాక యేదో నాకనాకు ఒన్నుకొని రణంబొనర్పుటకు రాక
నేమూల గూరుచొనియుంటివో వీరంద రెరుగరా.

కర్ణు॥ వింటివ మహారాజనీవు । వింటివ యీతని మాటలు ॥ విం॥ వింటి
విపుడు కాని మళ్ళి । విననొల్లను నీకూతలు ॥వి॥

వ॥ మహారాజా సుయోధనా యీ యెత్తిపొడుపుమాటలు విం
టివిగదా నేను పిరికిపందనై మూలకొదికియుంటినట. మళ్ళి
యీమాట బల్కినచో నేవినను.

అశ్వ॥ యున్నమాటబల్కినచో । నొవ్వకుందు రెవ్వరైన ॥ నొ ॥ యిన్ని
టికిని కారకుండ । వీవేకద నెంతకైన ॥నొ॥

వ॥ నేను నిజమే బల్కితిని యీయుద్ధమునకు ముఖ్యకారకుండవు
నీవేకదా.

కర్ణు॥ యాసీర్వచనములుజెప్పి । యడవినిలో జీవించునట్టి ॥ యు ॥ భూసు
రుడవు శత్రువులతో । బోరెదవా నడుముగట్టి ॥బో॥

వ॥ ఆశీర్వచనములు జెప్పి జీవనము గడపెటి బ్రాహ్మణుండవు
యుద్ధమున నడుముగట్టి శతృవులతో బోరుసంతటివాడవా ఛీ
యూరకుండుము.

అశ్వ॥ సూతపుత్రుడవునీకే । శూరత గలదోకాని ॥ శూ ॥ చూతు
ప్రాణమున్నయెడల । శుభమెవ్వరికౌనోగాని ॥శు॥

వ॥ ఒరే సూతపుత్రా రణాంగణమందు భీముని నెదిరించినపుడు నీ వెంతటి పరాక్రమవంతుడవో నేజూడకపోనా.

(అంత కృపాచార్యుం డట్టువచ్చి)

కృ॥ వలదువలదు మీరలిటుల । వాదించుట తగదునిపుడు ॥వా॥ యిలను మశురబాధ పోరి । యీశుని స్మరియించుచిపుడు ॥యీ॥

వ॥ కర్ణాశ్వత్థామలారా మీరిట్లు వాదించుకొనుటలో ప్రయోజనములేదు. యూరకుండుడు.

అశ్వ-వ॥ మామా చూచితివిగదా బ్రాహ్మణులన వీనికెంత అనిష్టముగా దోచుచుండెనో.

గీ॥ ఆదికాలంబునందున । నవనినెల్ల
పాలనముజేయు మనువుచు । బ్రాహ్మణుండు
కాడె భార్గవరాముండు । గాడె ద్విజుడు
దెలియడీ సూతసూతుండు । తెలివిమాలి॥

వ॥ ఆదికాలంబున నార్యావర్తంబెల్ల పరిపాలించిన స్వాయంభువుడును, ఇరువదియొక్కమార్లు క్షత్రియులపై దండెత్తి వారి నిరంకుశత్వమడంచిన పరశురాముండును బ్రాహ్మణులు కారా, మరియు నీకౌరవ పాండవులకు విలువిద్య భిక్షంబిడిన నాతండ్రియు బ్రాహ్మణుడు కాడా ఇట్లుండ వీడేమో కులముకొద్ది గుణము విద్యకొద్ది బుద్ధి యనునట్లుగా వాగుచుండెనుగదా.

దుర్యో-వ॥ గురునందనా శాంతింపుము నీకిదే చేతులుజోడించి చెప్పుచుంటిని.

కృపా-వ॥ అబ్బాయీ అశ్వత్థామా మహారాజుగారిమాట నాలించి ఆత్మగౌరవము గాపాడుకొనవలసిన యిట్టి విషమ పరిస్థితియందు యిట్లాండొరులము మనమే వాదించుకొనిన చూచినవారేమందురు.

అశ్వ-వ॥ ఔనుకాని.

గీ॥ గంగసూనుండు సమరరం । గంబునందు
పడెడుదాకను శస్త్రంబు । బట్టనంచు

పంతమూనెను నీతండు । బడెకుదాక
శస్త్రమిదె నేను ద్యజియింతు । శపథ మిదియె॥

వ॥ భీష్ముండు రణంబున గూలునంతవరకు శస్త్రము ధరించనని యీతడు పంతమూనియుండెను అటులే నేనుగూడ నీకర్ణుండు రణంబున హతుడగువరకు శస్త్రమును ధరించను యిదియే నాశపథము (అని తన చేతియందున్న ఖడ్గమును క్రిందబడవైచును)

వాదం - దర్వు.

కర్ణ॥ కత్తినీవు బట్టకున్న । కదనమేమి నిల్వదూర ॥క॥
వుత్తుత్త మాటలునీ । యురుకులాట మానుమూర ॥యు॥
వ॥ ఒరే బాపడవగు నీవు కత్తిని చేపట్టినను బారవేసినను రెండును సమానమే పొమ్ము.

అశ్వ॥ వింటివిగద మామాయీ । తుంటరి వాక్యంబులాను ॥తుం॥
మంటబుట్టె నరికాలుకు । వెంటనెపడద్రన్నుదూను ॥వెం॥
వ॥ మామా కృపాచార్యా యీదుర్మార్గుని మాటలను వినియుంటివిగదా. వీని నిప్పుడే నా పదతాడనంబున గూలవైచెదను చూడుము (అని కర్ణునిపై కురకబోవ కృపాచార్యుం డడ్డగించి)

కృపా॥ బాలకనీవిట్లుకోప । పడుటయు నిదిపాటిగాదు ॥ప॥
చాలును కర్ణునితో వగ । యేలనుయిది పనికిరాదు ॥యే॥
వ॥ బాలకా అశ్వత్థామా దుర్యోధనుని ముఖమైనజూచి శాంతింపుము.

కర్ణ॥ మొండిబాపడా నీదు । కండలన్ని జెండివైతు ॥కం॥
దండిగాను కాకులాకు । తనివిదీర దినగవైతు ॥త॥
వ॥ ఒరే దుర్మార్గా యూరకున్నకొలది నీవేమో నిక్కినిక్కి మాటలాడుచుంటివి నిన్నిప్పుడేమి జేసెదనో చూడుము (అని ఖడ్గమును బెరికినంతలో దుర్యోధనుం డడ్డగించి)

దుర్యో॥ మిత్రమనీవిటులజేయు । శత్రువులేమనియెదారు ॥శ॥
ధాత్రినిగల మశురబాద । ధవళాంగుడు మెచ్చబోడు ॥ధ॥

వ॥ మిత్రమా కర్ణా నాముఖమైనజూచి యూరకుండుము నిన్నిదే బ్రతిమాలుచుంటిని (అని కర్ణుని గదువబట్టుకొనును)

## ద్రోణాచార్యుడు ప్రవేశము

దరు॥ ఆర్యుడద్రోణాచార్యుడ రా స । త్తార్యా చరణుండను వినరా । శౌర్యసాహసోదార్యగుణుడరా । తుర్యుడ సంగర రంగవిజయుడను ॥ఆ॥ భరద్వాజముని పుత్రుడరా । స । చ్చరితుడ ధనురాచార్యుడరా । ధరమశురాపురి ధాముడైనయా । స్మరహరునెప్పుడు స్మరియించెదమది ॥ఆ॥

మాటలు॥ భరద్వాజమహాముని కుమారుండను కృపీదేవి మనోహరుండను ధనుర్వేదపారంగతుడను మన్నామంబు ద్రోణాచార్యుండని యందురు వారి వినుకోరి (అని యిటుల వచించి దుర్యోధనాదుల సన్నిధానంబున కరుదెంచి) దుర్యోధనమహారాజా మీరెల్ల రేదో విచారగ్రస్తులైనటుల నగుపడుచుంటిరి కారణమేమి.

దు-వ॥ ఆచార్యవర్యా

వాదం — దర్వు

దు॥ ఏమిసేయువాడనూ పి । తామహుండు నొరిగెను ॥ఏ॥
యేమిదోచదాయెను నే । నెవరికిస్తుంధిపత్యము ॥ఏ॥
వ॥ ఆచార్యా భీష్మపితామహుండు రణంబున నొరంగెను.యిప్పుడు సర్వసేనాధిపత్య మెవరికీయవలెనా యని విచారించుచుంటిని.
ద్రో॥ యిందులకై నీవునుచిం । తించుటపనిలేదునూ ॥యిం॥
యిందరిలో నెవరికైన । యివ్వుమునీసమ్మతిగను ॥యిం॥
వ॥ మహారాజా యింతమాత్రమునకు విచారింపవలసిన పనిలేదు. యిందరిలో నీకు యిష్టమొచ్చినవారికీయుగూడదా.
దుర్యో॥ పరగను యాభారమునా । పైనబెట్టుకొనుటకూ ॥ప॥
గురువర నేనిష్టపడను । మరినాసంకల్పంబువినుడు ॥ప॥
వ॥ గురువర్యా ఆభారము నాపైన బెట్టుకొనుటకు నాకిష్టములేక నేనొక ఆలోచన గావించియుంటిని.

ద్రో॥ మంచిదియటులైననూవ । చించుముయూవిధమునూ ॥మం॥
వెంచగ నీవన్నట్లుచ । రించెదాము యెంతకైన ॥మం॥

వ॥ సుయోధనా సర్వసేనాధిపత్యమునుగూర్చి నీవేమి యాలోచించి యుంటివో యిందరువినగ వక్కాణింపుము నీయాజ్ఞకు వేరు లేదుగదా.

దుర్యో॥ వినుడికనేదెల్పెదనా । మదిగలయా ముచ్చటా ॥వి॥
ఘనతరమగు మశురబాద । గారీశుడు మెచ్చునటుల ॥వి॥

వ॥ ఓయోధాగ్రేసరులారా సభాసదులారా

గీ॥ ఇందులో మీరలెవరైన । డెందమందు
ధైర్యముండినయెడల నా । ధర్మజున్ని
ప్రాణములతోడ నాకును । బట్టితెచ్చి
పరగ నిచ్చిన సైన్యాధి । పత్యమిత్తు ॥

వ॥ ఆపాండవాగ్రజున్ని ప్రాణములతో బట్టితెచ్చి నా కెవరర్పింతురో అట్టి వీరాగ్రేసరునకే సర్వసైన్యాధిపత్యమొసంగెదను. మీలో నెవరైన యిట్టిపని సేయగల్గినచో ముందుకురండు నా పారితోషికము సన్మానముం గైకొనుడు (అని కర్ణుని వంక జూచును)

కర్ణు-వ॥ మహారాజా నావంక జూచెదవేమి.

కందార్థము.

క॥ ఘనతరభుజవిక్రముడును
దనురాచార్యుండునతని । తనయుడు నీమ
న్ననలందుచుండ యికయో
చనజేసెద వెందుకయ్య ॥ జగదేకవీరా
మావలనయీ । పనిగాదుధీరా
మగటిమిగలవారు మహాశూరవరులు వా
రగణితబలులు కాదన్నా యోచించేము ॥జగ॥

వ॥ మహారాజా మహాపరాక్రమవంతుడగు ధనురాచార్యుండగు.

ద్రోణాచార్యుండును అతనిపుత్రుండగు నశ్వత్థామయునుండ నీవేలచింతించెదవు వారాపనిని చేయజాలమన్నచో చూచుకొనవచ్చునులే. (అనిన ద్రోణాచార్యుండు కోపంబున)

ద్రో-వ॥ అంగరాజా

గీ॥ యురుబలాఢ్యుడవంచు । సుయోధనుండు
అర్జునునిజంపుపనియు నీ । కప్పజెప్పె
నదియునీవొనరించిన । నంతెచాలు
యిట్టిభారంబునీతల । కెత్త దగదు ॥

వ॥ గంపెడాశబెట్టుకొని గాండీవిని ద్రుంచుపనిని సుయోధనుండు నీకిదివరకే యొప్పజెప్పెను అది నీవు నిర్వహించిన చాలును. (అని దుర్యోధనుని వంకజూచి) మహారాజా ఒకమాట.

వాదం – దర్వు

ద్రో॥ వినుసుయోధనా । నా । మనవియొకటి గలదు మీతో ॥ వి ॥
ఘనుడగుయా ధర్మజున్ని । గొనివచ్చియు జీవములతో । మనలో
నెవరైనదెచ్చియను నీకప్పచెదారు ॥వి॥
వ॥ దుర్యోధనా మనలోనెవ్వరైన ఆధర్మరాజును ప్రాణములతో బట్టితెచ్చి నీకొప్పగించిన నీవాతని నేమిజేయ దలచితివో యిందరు వినునట్లుగా దెల్పుము.

దుర్యో॥ తెలిసె గురువరా । నీ । పలుకుల యందలి యర్థము ॥ తె ॥
వలదటుసందేహపడగ । వైరివీరు నటుజేయగ । తెలివిహీనుడను
గాను । తెలిసియిటుల బలికెవేల ॥ తె ॥
వ॥ ఆచార్యవర్యా నీవట్లు సందేహించవలదు. ఆ పాండవాగ్రజుని చేజిక్కించుకొని చంపునంతటి యవివేకినా కాను.

ద్రో॥ అటులైతెవినూ । యా । హరిహరులికనడ్డుపడిన ॥ అ ॥ యెటులైనను ధర్మజున్ని యిటుదెచ్చియు నీకొసగెద । పటుతర శౌర్యంబుతోడ బ్రాణములకు నేదెగించి ॥ అ ॥
వ॥ మహారాజా యెటులైనను యా ధర్మనందనున్ని దెచ్చి ప్రాణములతో నీకర్పించెదను వింటివా.

దుర్యో॥ సరెమెచ్చితినీ । యో । గురువర నీధైర్యమునకు ॥ స ॥ ధరణి
మశురబాదపౌరి । హరుడు సంతసింపగాను । విరులమాల నీగళ
మున వేసియుప్రిణమిల్లువాడ ॥స॥

వ॥ గురువర్యా నీధైర్యశౌర్య సాహసంబులకు నేనేగాక యీసభ
వారెల్ల మెచ్చిసంతోషించిరి గాన నీకిదే సర్వసైన్యాధిపత్య
మొసంగుచుంటిని యీ విరిమాలంధరించుకొని నీ శపథమును
నెర వేర్పుము (అని పుష్పమాలను గురునిమెడలో వేయును)

## అభిమన్యుడు ప్రవేశము దర్వు

అరివీర భయంకరుడనురా । అభిమన్యుండను నేవినరా । సుర
నాథుని పౌత్రుడనురా నే । మరునికన్న సుందరుడనురా ॥ అ ॥ జనని
సుభద్రాదేవియురా నా । జనకుండర్జునుడనువినరా । వనజాక్షుడు నా
మేనమామయును । ఘనభుజబలుడను కదనవిజయుడను ॥అ॥ ధర్మరాజా
వాతాత్మజులూ పెద । తండ్రిలురా శుభచరిత్రిలూ । నిర్మలమూ
మశురాపురి వెలసిన । నీలకంధరుని నెమ్మదిదలచెద ॥అ॥

మాటలు॥ పాండవ మధ్యముండగు అర్జునుని కుమారుండను శ్రీ
కృష్ణబలరాముల మేనల్లుండను అరివీర భయంకరుండను మన్నామంబు
అభిమన్యుండందురు వారీ సూత్రిధారీ. (ఇటులనుచున్నంతలో రణభేరి
చెవింబడ)

గీ॥ అదుగొదుశ్శాసనుండు మ । హాద్భుతముగ
సైనికులతోడుగైకొని । సమరమునకు
వచ్చుచుండెను నేనేగి । వరుసతోడ
సమర మొనరించి బరిమార్తు । సాహసమున ॥

సం-వ॥ అని ధనుర్బాణంబులను గైకొని దుశ్శాసనున కెదురేగి
యేమనుచున్నాడన.

## పాదం - దర్వు

అభి॥ రారా దుశ్శాసనా । కూరిరా యీపోరునా । ధారుణికొరగింతు
నిన్ను పారకురా భయముజెంది ॥రా॥

వ॥ ఒరే దుశ్శాసనా నేడు మాత్రము నన్నుదప్పించుకొని పారి పోజాలవు నిల్వుము.

దుశ్శా॥ పిల్లలాటగాదురా । బల్లిదుండ నేనురా । వెళ్ళిపోయి యింటను నీతల్లియొద్దగూర్చుండుము ॥ పి ॥

వ॥ ఒరే అభిమన్యా నీవింకను బాలుడవు సమరమన్న దెరుంగవు నీతోటిబాలురతో ఆటలాడుకొనుము పొమ్ము.

అభి॥ బాలుడనేగానురా । కాలుడనిటుజూడరా । చాలురయిదె శూలంబును కేలంగొంటిని చచ్చెదవు ॥ బా॥

వ॥ ఒరే నీచా నన్ను బాలుడని బెదరించుచుంటివా నీపాలిటి మృత్యుదేవుండను యిదేశూలంబునువైచుచుంటిని దీనిఘాతం దప్పించుకొనుము చూచెదను.

దుశ్శా॥ నీవలెనేబల్కిరీ । నీతండ్రులు నిక్కిరీ । కావర ముడిగియును వారు । కాననంబుకేగియుండిరి ॥ నీ ॥

వ॥ ఒరే నీవలెనే నీతండ్రులుగూడ పౌరుషోక్తులాడి చేయునది లేక అడవులలో ఆకులలముల మెక్కియుండుట దెలియవా.

అభి॥ మాయజూదమాడియూ । మావారిని గెలిచియూ । పాయక మా వార్నివనుల పాల్జేసిన పాపాత్ములు ॥మా॥

వ॥ ఒరేదురాత్మరా దుశ్శాసనా

గీ॥ కడకునున్నట్టికాంతను । కచములంటి
యీడ్చివలువలనిప్పిన । హీనుడవుర
దొరికితివి నేడు నీతల । దరుగకున్న
విజయసూనుండ నేగాను । వినరదుష్ట ॥

వ॥ ఒరే నీపాపఫలంబు నిన్నిప్పుడే గుడిపించెదనుచూడుము.

దుశ్శా॥ బాలుడ నినుజూడగా । జాలిగలుగుచుండెగా । చాలుర నీవాగ్జాలము యేలరనిక మరలిపొమ్ము ॥బా॥

వ॥ ఒరే సౌభద్రా నిన్ను జంపుటకు నాకుచేతులు రాకున్నవి యీ పెక్కుమాటలు చాలించి మరలిపొమ్ము.

అభి॥ పిరికివాడ గానురా । దురమున నిమూ ద్రుంతురా । కనకకటాస్త్రమిదు
గో నీ శిరముండుల్ల జేసెదాను ॥ పి ॥

వ॥ ఒరే మతిహీనా నేనేమి పిరికివాడను గాను యీ ఘోరాస్త్రం
బున నీశిరంబు నేలం డుల్ల జేసెదను చూడుము (అని బాణం
బెక్కుబెట్టి విడచినదానిం దప్పించుకొని)

దుశ్శా॥ గొప్పశరములిదుగోరా । కుప్పలుగను వచ్చెరా । తప్పించుక
పోవు నీవు । కుప్పవలెను గూలెవిపుడు ॥గొ॥

వ॥ ఒరే యీ నాశరంబుల రుచింజూడుము వీటిని దప్పించుకొన
జాలవు (అని విశిఖంబుల ప్రయోగించిన వాటినన్నిటిని నడుమనే
యుపసంహరించి)

అభి॥ ఖలుడ నీశరంబులూ । గంటిగడ్డిపుడకలూ । బలముగల్ల వాడవ నా
భల్ల బాణమిదుగో చూడు ॥ఖ॥

వ॥ ఒరే నా యీ భల్ల బాణంబున నీయురంబు భేదించుచుంటిని
చూడుము (అని ప్రయోగించిన దుశ్శాసనుండు గాయపడి
కోపంబున కనులెర్రంజేసి)

దుశ్శా॥ గదచేతను గొంటిరా । వదలకనిను ద్రుంతురా । కదనభీకరుం
డను నీసుదతికి నెడబాసితివిర ॥ గ ॥

వ॥ ఒరే అభిమన్యా యిదో నాగదాదండంబును దప్పించుకొనుము
చూచెదను (అని గదను విసరికొట్టిన అభిమన్యుండు తనగదతో
దానిని నడిమికి ఖండించి వేసినం జూచి దుశ్శాసనుండు పారి
పోవుటయు నంత)

అభి॥ పారిపోకు నిల్వరా । శూరత నిదిగాదురా । ధారుణి శ్రీ మనురా
పురి ధవళాంగుడు మెచ్చడిదిర ॥

సం-వ॥ దుశ్శాసనుండు పారిపోయినంత అభిమన్యుండు విజయో
త్సాహంబున తనశిబిరంబునకు వచ్చుచున్నంతలో.

సుభద్ర ఉత్తర ప్రవేశము

సుభద్ర - దరువు

మంథరాంగీ సుభద్రనమ్మా - మందయానను మహాశీలనమ్మా ॥సుం॥

యింతి యర్జును కాంతానోయమ్మా - కుంతిదేవికి కోడలనమ్మా ॥ సుం ॥ శ్రీరమేశుని చెల్లెలనమ్మా - సారసాక్షీ సచ్చరితనమ్మా ॥ సుం ॥ ధరణి మధురాపుర వాసుడమ్మా - హరియె మమ్మాల కరుణించు నమ్మా ॥ సుం ॥

సు-వ॥ బిడ్డా ఉత్తరా,

ఉ-వ॥ అత్తమ్మా ఏమి సమాచారము.

సు-వ॥ సమాచార మేమున్నదిగాని మాబాబు అభిమన్యు డింత వరకు రాడాయెను.

ఉ-వ॥ అదుగో రానే వచ్చుచున్నారు అబ్బా ఆ గాయములేమి (ఇంతలో అభిమన్యుండరుదెంచి)

అభి-వ॥ తల్లీ నీపాదపద్మములకిదే ప్రణమిల్లువాడను.

సు-వ॥ కుమారా ఆ దుర్మార్గుడగు దుశ్శాసనుడు నిన్నింతగా గాయపరచెనా తండ్రీ.

చం॥ కరుణయొకింత లేక కను । గందువటంచు దలంచబోక యా
కురుకుల వృక్షకీటకము । క్రూరుడు పాపుడు దుష్టచిత్తుడు
దూరమున నీదుగాత్రమిటు । దూల్లు పడంగను జేసెనక్కటా
మరినిను గన్న విన్నయెడ । మారుతి వానిని గావుబట్టడే ॥

అభి-వ॥ అమ్మా నేనోడిరాలేదు ఆదుర్మార్గుని రణమందు నోడించి వచ్చితిని.

ఉ-వ॥ ప్రాణేశ్వరా రమ్ము నీగాయములకు కట్లుగట్టి సేవ యొన ర్చెదను,

సు-వ॥ ఔను కుమారా రమ్ము (అని శిబిరములోని కేగుదురు)

ధర్మరాజు భీముడు అర్జునుడు
శ్రీకృష్ణుడు ప్రవేశము

ధ॥ నిర్మలాత్ముడను నీతికోవిదుడ - ధర్మరాజ నాముండనురా - దుర్మా
ర్గుల శిక్షించెటివాడను - ధర్మతత్పరుడనువినరా ॥ ని ॥

వ॥ ఒరేఒరే పాండురాజుగారి జ్యేష్ఠకుమారుండను ధర్మాధర్మ విచక్షణుండను ధర్మరాజను నామంబుగలవాడను సారథీ గుణ వారథీ.

భీ॥ భీమసేనుడను వినరా నేరిపు - భీకరుడను సుగుణాకరుడా - యీమహిలో నానామమువిన్నను - భూమియుగడగడ వడకునురా ॥భీ॥

వ॥ ఒరేఒరే పాండుభూపాలుని ద్వితీయాత్మజుండ నగు నన్ను భీమసేనుండని యందురు వింటివా.

అర్జు॥ విజయుడ సంగరవిజయుడరా నే - భుజవిక్రమ సాంద్రుడగనరా - భుజగభూషణుని సంగరమందున పాలుపొందగ నోడించితిరా ॥వి॥

వ॥ ఒరేఒరే పాండునరేంద్రుని తృతీయకుమారుండనగు నన్నర్జునుండని యందురు దూతా వినయవిఖ్యాత.

కృష్ణ॥ శ్రీరుక్మిణి ప్రియ వల్లభుడను నే - శ్రీకృష్ణుండను వాడనురా - ధారుణి శ్రీమథురాపురివాసుల - దప్పక సంరక్షించెదరా ॥

వ॥ ద్వారకాధీశుండను దేవకీవసుదేవుల కుమారుండను రుక్మిణీ సత్యభామాద్యష్ట భార్యాలోలుండను మన్నామంబు శ్రీకృష్ణుండని యందురు ద్వారకా వినువేసారకా.

## వాదం - దర్వు

అర్జు॥ బావాసంశప్తకులను - బారదోలవలయురమ్మా ॥బా॥
తీవరంబుగానుయిపుడు - తేరునుయిటు గొనియుతెమ్మా ॥తే॥

వ॥ బావా శ్రీకృష్ణా మనము సంశప్తకుల నురుమాడుటక్కై బోవల యును తేరును సిద్ధపరచుకొనిరమ్ము.

కృ॥ అటులే నేతేరునిపుడు - నిటుదెత్తును నోవిజయా ॥ యి ॥
పటుతరగతి సంశప్తక - బలములతో పోరుజేయా ॥ బ ॥

వ॥ అర్జునా నీవన్నంతమాత్రమున రథమును సిద్ధపరచుకొని తెచ్చి యున్నవాడను చూడుము.

భీ॥ అనుజనీసహాయముగను - జనుదెంచెద నేనుగూడ ॥ జ ॥
ఘనముగసంశప్తకులను - దునిమాడెదగదతోడ ॥ దు ॥

వ॥ అనుజా అర్జునా నేనుగూడ మీతో సరుదెంచి ఆ సంశప్తకు
లను రూపుమాపెదను.

అర్జు॥ అటులైనను మంచిదెయిక - నాలస్యంబదియేలను ॥ అ ॥
ధరణిమశురబాడవౌరి - హరియే బ్రోచును మనలను ॥ హ ॥

వ॥ అన్నయ్యా అటులైన ఆలస్యంబేదులకు (అని ధర్మరాజుం
జూచి) అన్నా మాకాజ్ఞనొసంగుము అరివీరుల జయించి
వచ్చెదము.

ధ-వ॥ త్వరలో విజయమును గాంచిరండు (అనిన వారువెడలి
పోవుదురు నంత)

దుర్యోధన దుశ్శాసన కర్ణ సైంధవ
శకుని ద్రోణాచార్యులు ప్రవేశము.

ద్రో-వ॥ కురుకులవతంసా చూచితివా దీనిని పద్మవ్యూహ మని
యెదరు. దీనిని భేదించుట ఆయర్జునునికిదప్ప నితరులవల్లగాదు. ఇందులో
జిక్కుకొనినవాడు తిరిగిపోజాలడు.

దు-వ॥ ఆచార్యా నీ యీ వ్యూహరచన మహాద్భుతకరముగా
దోచుచున్నది. ఎవరెవరిని యెక్కడెక్కడ నియమించెదరో అట్లు నియ
మింపుడు.

వాదం - దర్వు

ద్రో॥ మొనలయందు జూడసూది - మొననై ననుజొరకుండగ ॥
మనదళముల నుంచవలయు - మహారాజా వినుడిబాగ ॥ మొ॥

వ॥ మహారాజా యీ వ్యూహముఖంబున మన సైనికదళమును
దట్టముగా సూదిమొనగూడ జొరకుండు నటుల నుంచ
వలయును.

దుర్యో॥ మీరుదెలిపియున్నట్టుల - భూరిగమన సైన్యంబును ॥భూ॥
ఆరూఢిగ నిలిపెదాను - యాచార్యా నుడువుడికను ॥మీ॥

వ॥ గురువర్యా అటులేగావించితిని గాని యింకా మన యోధా

గెలిసరు లెవరెవ రెచ్చటెచ్చట నుండ వలయు నో
తెల్పుడు.

ద్రో॥ తూర్పు దెసను గాచుకోని - దుశ్శాసను డుండవలెను ॥ దు ॥
వోర్పింతయు లేకుండను - వైరుల దునుమాడవలెను ॥తూ॥
వ॥ దుశ్శాసనా నీసైన్యయుక్తముగా పూర్వాదిశ మొనపై నిలిచి
యుండి వైరివీరుల జెండాడుము.

దుశ్శా॥ సరుసరె మీయాజ్ఞాను - సారంబే వర్తించెద ॥సా॥
గురుతరబల శౌర్యంబున - నరివీరుల చెండాడెద ॥ స ॥
వ॥ ఆచార్యా మీ యాజ్ఞానుసారం బటులే వర్తించెద.

ద్రో॥ ధీరతో శకునీ పశ్చిమ - దిశకీవును కాపుండియు ॥ ది ॥
బీరము జెడకనువైరుల - బింకంబుల నణచవలయు ॥ ధీ ॥
వ॥ శకునీ నీవు పశ్చిమదిశ మొనను గాపాడవలయును.

శ॥ అటులేగా పాడువాడ - యతిశౌర్యంబున నేనూ ॥ య ॥
పటుతరముగ వైరులాను - బట్టి నేల గూల్చెదాను ॥అ॥
వ॥ స్వామీ మీ యాజ్ఞానుసారంబుగా మెదలెదను.

ద్రో॥ వొప్పుగాను కర్ణానీ - వుత్తరదిశ నుండుమయ్యా ॥ ఉ ॥
తప్పకుండ పగవారిని - ధ్వంసము గావించుమయ్యా ॥ వొ ॥
వ॥ కర్ణా నీ వుత్తర దిశను గాపాడుచుండుము.

క॥ నేనుండెడుదిశకు రిపులు - రానేరారయ్యా వినుడు ॥రా॥
యేనాటికి మీమదిలో - నేమాత్రము భయపడకుడు ॥ నే ॥
వ॥ ధనురాచార్యా మీరన్నటులే యుండువాడను.

ద్రో॥ కురునాధా దక్షిణదిశ - కొప్పుగనీవుండుమయ్యా ॥ నొ ॥
మరివినునే వ్యూహంబుకు - మధ్యనకాపుందునయ్యా ॥ కు ॥
వ॥ సుయోధనా నీవు దక్షిణదిశ మొనయందుండుము నేను
వ్యూహామధ్యంబున నుండువాడను.

దుర్యో॥ ఆచార్యా మీయొక్క - ధీ చతురత వర్ణింపగ ॥ధీ॥
యా చంద్రమౌళికైన - యలవిగాదునిక్కంబుగ ॥ ఆ ॥

వ॥ స్వామీ మీయొక్క వ్యూహరచన కెంతయును సంతోషించితిని. ఇంక ఆలస్యమెందులకు మన మన శంఖంబులను పూరింతము ( అని యొక్కపెట్టున తమతమ శంఖములను పూరింతురు, అది విని ధర్మరాజు )

ధ—వ॥ సారథీ ఆ శంఖనాదంబులను వింటివిగదా. రథమాయత్త పరచుకొని శీఘ్రముగా రమ్ము.

సా-వ॥ మహారాజా రథమెల్లప్పుడును సిద్ధముగానే యుండును తా మధిరోహించుటే ఆలస్యము.

ధ—వ॥ సరే అటులైన పద (అని ధర్మరాజు రథంబుపై గూర్చుండి నారీ టంకారముం జేయును )

ధర్మ — దరువు

భూరివిక్రమము బొలుపొందంగను - నారీ టంకారముగావించి - వ్యూహముఖంబున నున్నవారలను - సాహసంబుతో చావగమోదితి - అదుగదుగో యాకౌరవసైన్యము - అక్కడిక్కడను బారగజొచ్చిరి - ధనురాచార్యుని యెదిరించితిని - మనసులో నమస్కార మొనర్చితి ॥ రామారామా రఘుకులసోమా - ఆహారామా అయోధ్యరామ - జయజయరామ జానకిరామా ॥

సం—వ॥ అని యిటులనుచున్నంతలో దుర్యోధనుం డరుదెంచి యేమనుచున్నాడన.

దు—వ॥ అన్నా యమనందనా ఇంచుక యుద్ధమును మాని నే వచించు రెండుమాటలను విందువా.

ధ—వ॥ దుర్యోధనా అదేదో చెప్పుము.

వాదం - దరువు

దు॥ జీవహింసయనగభీతి - జెందువాడవన్నయ్యా ॥ జెం ॥
యావిధి యుద్ధంబుజేయు - టొందుకువో అన్నయ్యా ॥ యెం॥

వ॥ అన్నా ప్రాణహింసయనిన సహింపనివాడవగు నీవీ యుద్ధమేల
దలపెట్టితివి యిందువల్ల నెందరిప్రాణములు బోవుచున్నవో
చూడుము.

ధ॥ తప్పులేదు సంధికి నీ - వొప్పకుంటి వెందుకూను ॥వొ॥
యిప్పటికై దూళ్ళ మాకు - నిచ్చియున్న మంచిదౌను ॥యి॥

వ॥ ముందే జెప్పియుంటిమిగదా యిప్పటికైన సంధి కొడంబడి
మాకైదూళ్ళనిచ్చిన చాలును.

దు॥ తోచకుండెనా మదిలో - దోచినమాటన్నయ్యా ॥తో॥
యాచకులట్లడుగను మరి - యాదగాదు అన్నయ్యా॥

వ॥ అన్నా నీవు నామదిలోని మాట గ్రహించక అట్లనుచుంటివి.
మీరు సర్వరాజ్య మేలువారలయ్యుండికూడ యాచకులవలె
నైదూళ్ళనిమ్మని నన్నడుగుట మీకు మరియాదగునా.

ధ॥ అటులైనను నీమదిగల - యట్టిమాట దెల్పుమయ్య ॥అ॥
యెటులైనను యర్ధరాజ్య - మిచ్చెదనని బల్కుమయ్య ॥యి॥

వ॥ సరే దుర్యోధనా అటులే నీకున్నచో మాయర్ధరాజ్యము మా
కిచ్చి నలువురిలో ఔననిపించుకొనుము.

దు॥ జూదములో సర్వమ్మును - మోదముతో గెల్చుకొంటి॥
యేదియింక మీభాగం - బేడనుండె దెల్పుమంటి ॥యే॥

వ॥ జూదములో మీరాజ్యభాగము నోడిపోయితివిగదా మళ్ళి
భాగమిమ్మనుట మరియాదగునా.

ధ॥ వనవాసము యజ్ఞాత - వాసము గడిపితిమిమేము ॥వా॥
అనుకున్నట్టుల మాదు - యర్ధరాజ్యమడిగెదాము ॥అ॥

వ॥ అనుకున్న ప్రకారముగా మేము పన్నెండేండ్లు వనవాసము
ఒకయేడజ్ఞాతవాసము గడిపితిమి. ఇక మాభాగము మాకు
బంచియిమ్మనుటలో తప్పేమి.

దు॥ సగము రాజ్యమేలనీకు - సర్వము లభియించుమాట ॥స॥
సుగుణాత్మ దెల్పెదాను - జూడుమింక మది తేటా ॥జూ॥
వ॥ అన్నా యీరాజ్యమును మేమైనా పాలించవలెను లేదా మీరైనా పాలించవలెనుగాని పంచుకొనుటకు నాకిష్టములేదు యిందుకొక యుపాయమును దెల్పెదను వినుమా.

ధ॥ వినదగినదైన యెడల - విందునేను కాదననూ ॥విం॥
వినగూడనిమాటయైన - విననొల్లను యెవరన్నను ॥వి॥
వ॥ వినదగిన మాటైనచో తప్పక విని యెదను కాని వినగూడని దైనచో యెవ్వరుజెప్పినను వినను.

దు॥ మళ్ళి ఒక్కసారిజూద - మాడియు మీవిభవమెల్ల ॥ఆ॥
యెల్ల జనులు యానసంగ - గెలుచుకొమ్ము నల్లశిల్ల ॥గె॥
వ॥ అన్నా మళ్ళి ఒక్కసారి మాతో జూదమాడి మీవైభవం బెల్ల గెల్చుకొనగూడదా.

ధ॥ యింకనన్ను మోసగించ - యెత్తువేసియుంటివౌర ॥యె॥
మంకువాడ మశురబాద - మహాదేవుడు మెచ్చునటర ॥మ॥

వ॥ ఒరే ఎంతటి యెత్తువేసితివిరా మీ మామయగు శకుని మాయాజూదంబున మమ్మింతకు దెచ్చినది నేనింక మరచి పోలేదు పూరక యర్ధరాజ్యమిచ్చినచో యూరకుందుము లేనిచో యుద్ధమునమిమ్మందర వధించి గైకొందుము వింటివా.

దు-వ॥ అర్ధరాజ్యముగాదు మీకొక చిల్లపెంకైనను యివ్వను.
ధ-వ॥ ఇవ్వకున్న మీకర్మము మీరు గుడిచెదరు.
దుశ్శా-వ॥ ఆ ఏమంటివి.

గీ॥ చాలునోర్యోయునీకింక । చావుమూడె
కర్ణ॥ శరణటంచు సుయోధన । చక్రివర్తి
సైం॥ పదములను వ్రాలియున్నచో । బ్రదికెదీవు
శకు॥ యట్లుగాదేని యమలోక । మంపువాడ ॥

ధ - వ॥ ఓరే దుష్టచతుష్టయులారా మిమ్మిప్పు డేమి జేసెదనో చూడుడు (అని ధనుష్టంకారమును గావించి)

ధర్మ - దర్వు

ఓరీ దుష్టచతుష్టయులారా । రారండికమిము రయమొనరించెద । శరమునువింటను సంధించితిరా । వర్షమురీతిగ గురిపించెదరా । నలువురు గాదుర నాల్గువేలయిన । నలిచివేతురా నల్లులరీతిగ ॥ రామారామా రఘుకులసోమా ॥

సం-వ॥ ఇట్లుండ నక్కడ శిబిరములో అభిమన్యుడు పవళించి యుండ ఉత్తర సేవజేయుచుండును.

ఉ-వ॥ మనోహరా మీావొంటిలో నిపుడెట్లుండెను. ఇంకా గాయములు పచ్చిగానే యున్నవికదా. నిద్రైన పట్టుటలేదుగదా.

అ-వ॥ పిచ్చిదానా. ఇది నిద్దురపట్టు సమయమా.

గీ॥ పరులు మనయొక్క రాజ్యసం । పదలనెల్ల
బలిమి హరియించి యిక్కట్ల । పాలుజేసి
సమరమందున మమ్ముల । జంపబూన
నిద్ర నాకెట్లువచ్చునో । నీలవేణి ॥

వ॥ అదియునుంగాక మిత్రరాజు లెందరో ప్రాణములయందలి ఆశను విడనాడి మనపక్షమై పోరాడుచుండ పీరమాతపుత్రుండనగు నేను యుద్ధమునకేగక నింటబడియున్న నాకు నిద్రవచ్చునా నీవే చెప్పుము.

ఉ-వ॥ ఔనుగాని గాయములు మానవలయునుగదా.

అ-వ॥ నిన్నుజూచుచున్నంతలో నీమృదు మధురవాక్కు లాలించినంతలో నాబాధ శమించినది.

వాదం - దర్వు

అ॥ సారసనయనీ । యో । చారుగాత్రి నామనోహారి ॥సా॥ శూరుడనై

యుండినిండు । చూలాలివి నీమదిగల । కోరికలను దీర్పకున్న ।
కోరగాని వాడనైతి ॥సా॥

వ॥ మనోహారీ నిండు చూలాలివగు నీకెన్నో మేముజేయవలసి
యుండెను. ఇందులకేమి సేయుదును.

ఉ॥ చిత్తజరూపా । యిటుచింతించుట పాటిగాదు ॥ చి ॥ అత్తమ్మయు
యిటులెప్పుడు యనుచుండును నాతోడను । యెత్తెరగున జరుగ
వలెనో । నత్తెరగున జరుగుచుండు ॥చి॥

వ॥ ప్రాణేశ్వరా మాఅత్తమ్మవలె మీాకుగూడ బిచ్చి పట్టినట్లుగా
దోచుచున్నది. యెప్పుడుజూచినా యిదేమాట.

అ॥ ముద్దియ వినవే । నా । వద్దికియిటుజేరరావె ॥ ము ॥ ముద్దొకటిచ్చి
యునునాకు మురిపెంబును జేకూర్చుము । వద్దనియనబోకు నేను
వదలజాల సుగుణశీల ॥ము॥

వ॥ సఖీమణీ నాకొక ముద్దివ్వవా.

ఉ॥ మానవనాథా ।యెవ। రైనవిన్న నేమందురు ॥మా॥ కాని నిన్నటిరేయి
నొక్కకలగంటిని యదివదలంప । మానసంబులోనను భయమందు
చున్నదాన స్వామి ॥మా॥

వ॥ ప్రాణేశ్వరా నిన్నటిరేయి నేనొక పాడుకలగంటిని అది జ్ఞాపక
మునకు వచ్చునపుడెల్ల నాకు భయమగుచుండెను.

అ॥ కలనిజమగునా । వో । లలనామేనాటికైన ॥క॥ కలలో దోచినవస్తువ
కనుపడునా తెలివొందియు । దిలకించిన సర్వము నిష్ఫలమంచును
దోచుగాదె ॥క॥

వ॥ వెర్రిదానా కలనిజమగునా నీవేల భీతిజెందెదవు.

ఉ॥ జీవితేశ్వరా । నా । భావమిపుడు కుదుటపడెను ॥ జీ ॥ పావనాంగ నీ
వుండగ । భయమదేల నామదికిని । కేవలముగ మశురబాధ ।
భావజారి కృపయెటులో ॥జీ॥

వ॥ ప్రాణేశ్వరా అదిసరేగాని యెవరో వచ్చుచున్నటుల దోచు చున్నది. (అనునంతలో సుభద్ర ప్రవేశించి)

సు-వ॥ బాబూ బాబూ వింటివా యీ విపరీతము.

అ-వ॥ అమ్మా యేమిసమాచారము. ఎందుకట్లు అదరిపడుచుంటివి.

సు-గీ॥ ఒట్టి కౌరవుల్ పద్మవ్యూ । హంబుబన్ని
యక్కటా నీదుపెదతండ్రి । నొక్కరున్ని
చుట్టుముట్టియు బందిగా । బట్టుకొనియు
నున్నవారట నెటుదోచ । కుండె తండ్రి ॥

వ॥ వింటివా యాకౌరవాధములు మీపెదనాన్నగారిని ఒంటిగా జిక్కించుకొని యుండిరట మీనాన్నగారేమో సంశప్తకులపై యుద్ధమునకు వెడలియుండిరి యిపుడేమిజేయవలెనో తోచకుండెను.

అ-వ॥ ఆ- ఆదుర్మార్గు లెంతపని గావించిరి, అమ్మా ఆ ధనుర్బాణంబుల నిటుదెమ్మా.

గీ॥ త్వరగనేబోయి కౌరవా । ధముల నెల్ల
వొక్కరొక్కరి శిరముల । వ్రక్కలించి
కీర్తిశేఖరుడౌ సమ । వర్తిసుతుని
గొనియువచ్చెద సెలవిమ్మ । జనని నీవు ॥

వ॥ తల్లీ నేనిప్పుడేపోయి యాపద్మవ్యూహమును భేదించి మాపెద తండ్రిగారికే యపాయంబు గలుగకుండ దోడుకొని వచ్చెదను సెలవొసంగుము.

సు-వ॥ అయ్యో తండ్రీ నీగాయము లింకను మానుముఖము పట్ట కుండెను. ఇట్లుండ మళ్ళి యిప్పుడే యుద్ధమునకు బొమ్మని యెట్లు బల్కనోపుదును.

గీ॥ త్వరగ నెవరైననేగి నీతండ్రితోడ । నైన యావాయు సుతుతోడనైన జెప్పి । యున్నమేలౌను గదర నాయన్ననిన్ను । యెట్లుదోలుదు కటకటాయేమిసేతు॥

వ॥ కుమారా ఎవ్వరైన త్వరితగతినేగి యీవార్త మీనాన్నగారి

కైన మీపెదనాన్నగారికైన విన్నవించినచో యెంతమేలగును. అయ్యో ఏమిసేయుదును. (అని యిటులను చున్నంతలో)

ద్రౌపదీ దేవి ప్రవేశం

దరువు॥ ద్రుపదాత్మజనమ్మా । నేనూ । ద్రౌపదినే కొమ్మా । కపటమెరుంగని పాండవేయులకు కాంతను నేనమ్మా వినుమా ॥ద్రు॥ సరసిజాక్షినమ్మా । సద్గుణ । భరితను నేనమ్మా । ధరమఃశురాపురి ధాముడైన యా । హరునిగొల్తునమ్మా వినుమా ॥ ద్రు ॥

వ॥ సుభద్రా సుభద్రా ఎక్కడుంటివే.

సు-వ॥ అక్కా యిక్కడనే యున్న రమ్మా. ఆహా యిదేమి వీరనారీవేషముతో ధనుర్బాణములం దాల్చివచ్చితి వెందులకు.

ద్రౌ-వ॥ అదంత విచారించునంతటి యవకాశము లేదు.

వాదం — దరువు

ద్రౌ॥ లెమ్మసుభద్రా । రా । రమ్మాకూర్చుంటివేల ॥ లె ॥ కొమ్మ ధనుర్బాణములను । కురువీరులతోడను యు । ద్ధమ్మజేసి వారి యొక్క దుమ్ముదులిపి వచ్చెదామూ ॥ర॥

వ॥ సుభద్రా పద్మవ్యూహంబున మీబావగారు జిక్కువడి యుండిరట మనముబోయి యాకౌరవులను జయించి వారిని విడిపించుకొని వచ్చెదము రమ్మా.

సు॥ అక్కరో వినవే । మన । మాడువార మగుటచేత ॥అ॥ కక్కసముగ కౌరవులతో కదనమెట్లుజేయగలము । యెక్కడదోచదు నాకిక । నేమిసేయుదాననమ్మ ॥అ॥

వ॥ అక్కా కౌరవులను మనమెదిరించగలమా. అదిగాక యాపద్మవ్యూహమును భేదించగలమా నాకెక్కడ దోచకుండెనుగదా.

ద్రౌ॥ పిరికిదానవా । యూ । హరికిని చెల్లెలవుగావ ॥పి॥ అరదము నడి

పింతు నేను । శరముల గైకొనియునీవు । దురమందున వైరుల
యమపురికినంపి వత్తుమిపుడె ॥పి॥

వ॥ సుభద్రా ఏల యిట్లు పిరికిదానివలె మాట్లాడుచుంటివి.

గీ॥ గర్భవతివయ్యి నీవున్న । కాలమందు
పద్మవ్యూహంబుజూడగా । భ్రాంతిగొనగ
హరియుజూపింప జూడవే । యదియునీవు
మరచిపోతివ యావ్యూహ । మర్మమెల్ల॥

వ॥ నీవు గర్భవతివిగా నున్నపుడు నీవు పద్మవ్యూహంబు జూడం గోరిన శ్రీకృష్ణుండు వెంటనే నిన్ను ద్వారకకు గొనిపోయి అచ్చట తమసైన్యమును పద్మవ్యూహముగా నిలిపి దానిని భేదించు క్రమమును నీతో జెప్పచుండెనంటివి అట్టిమాట నప్పుడే మరచితివా రమ్మా నేను రథంబుదోలెదను నీవా కౌరవులను చెండాడుము. ఔనుకాని మాటల సందడిలో బాబు నే మరచితిపోతిని (అని అభిమన్యుని జూచి) కుమారా నీగాయములు మానెనా ఏదీ నీచేయింజూపుము.

అ॥ అమ్మమాటకూ । పె । ద్దమ్మా మనవెరువవలదు ॥అ॥ నమ్మతి దీవిం చియు సెలవిమ్మయిట్టి తక్షణమున । నమ్మము యాకౌరవులను నాశన మొనరించివత్తు ॥అ॥

వ॥ పెద్దమ్మా నాకిప్పుడే దీవించి సెలవొసంగుము యా కౌరవాధ ములను గడ్డిగరిపించివచ్చెదను.

ద్రౌ॥ వలదుకుమారా । పో । వలదునిపుడు యనిసేయగ ॥వ॥ బలిమి కిటుల నాజ్ఞనొసగి । బంపుదు నెటువలెనిన్నిక । ఖలుడగు ద్రోణా చార్యుడు । గావించెను యింతటిపని ॥వ॥

వ॥ కుమారా నిన్ను బంపుటకిది సమయముగాదు యూరకుండుము.

అ॥ జననిరో వినవే । యిటు । లనకను నాకాజ్ఞనిమ్మ ॥ జ ॥ ధనురా చార్యుని దుర్యోధనుని దుస్ససేనునినే । దునుమాడియు పెదతండ్రిని దోడుకొనియు వచ్చెదాను ॥జ॥

వ॥ పెద్దమ్మా నీవేల భయపడుచుంటివో కాని తెలియజాల కున్నాడను.

గీ॥ ప్రేమతోనాకు మారెయొక్క । పెద్దమామ
గరపియున్న గదాయుద్ధ । కౌశలంబు
శౌరియొసగిన దివ్యాస్త్ర । శస్త్రపటిమ
జూపు సమయమువచ్చె న । న్నాపకమ్మ.

వ॥ తల్లీ త్వరగానాకు సెలవొసంగుము. దీవించుము.

ద్రౌ॥ యెటుదోచదుగా । నే । నేమనిపొమ్మందునిన్ను ॥ యె॥ కటకట పడజేసెను మనకర్మమేమొ తెలియజాల । పటుతరమగు మశురబాధ । పార్వతీశుడే గలడిక ॥యె॥

వ॥ తండ్రీ యిపు డేమనవలెనో తోచకున్నది.

సు-వ॥ అక్కా చింతిల్లకుము నీవాజ్ఞనివ్వకున్న నేనిచ్చుచుంటిని. కుమారా యిదో యీ ఖడ్గకవచంబులం దాల్చి అరివీరులం జయించిరమ్ము.

అ-వ॥ ధన్యుడను. (అని ద్రౌపదీ సుభద్రల పాదంబులకు మ్రొక్కి భద్రా రథంబును దీసికొనిరమ్ము అనిన సారధి రథముంగొని తెచ్చిన నెక్కి వచ్చుచున్నంతలో)

## ఘటోత్కచుండు ప్రవేశము

దరు॥ దండిబలుడనే ఘటోత్క । చుండనువాడను వినరా । కొండలనైనను నాదుకొనగోటను జిమ్మెదరా॥దం॥ గదచేకొని నిలచినసుర । గనజాలం డెవ్వడురా । కదనమందురిపులబట్టి । ఖండించెటివాడనురా ॥దం॥ జనకుడు భీముండునాదు । జనని హిడింబియు వినరా । యనవరతము మశురబాధ । యభవుని స్మరియించెదరా ॥దం॥

మాటలు॥ ఒరేఒరే అరివీరభయంకరుండను అబ్ధిగంభీరుండను భీమసేనుని పుత్రుండనగు నన్ను ఘటోత్కచుండని యందురు వారీ వినుకోరి.

గీ॥ కమలవ్యూహంబు బన్నియు । కౌరవులును
వొంటివాడుగ ధర్మజు । డుండజూచి

పట్టియుండిరటంచు యి। ప్పట్లనేను
వింటివారిని విడిపింప । వెడలుచుంటి ॥

వ॥ మాపెదనాన్నగారగు ధర్మరాజులవారిని ఆ పాపాత్ములగు కౌరవులు పద్మవ్యూహంబున జిక్కించుకొనిరనివినియుంటిని కావున నేనిప్పు డేపోయి వారిని విడిపించుకొనివచ్చెదను. (అని వెడలివచ్చుచున్నంతలో)

అభి — దరువు

జొచ్చితినే నీపద్మవ్యూహమును। విచ్ఛిన్నముగావించెదచూడుము। ధనురాచార్యుని దండలువిరచెద । ఘనముగకర్ణుని కంఠముగోసెద । దుర్యోధనుని తొడలువిరచెదా । దుశ్శాసన నీ దుఃఖితుజేసెద । శకుని బలంబును చూరబుచ్చెదా । సైంధవు నిప్పుడె జంపివైచెదను ॥ రామా రామా ॥

సం-వ॥ అని అభిమన్యుండు మహోర్భాటంబుగా వచ్చుచున్నంతలో కౌరవయోధులు చుట్టుముట్టడించినం జూచి,

వాదం — దరువు

అ॥ నిలువుడినిలువుడి మిమ్ముల । నిప్పుడె వధియించెదాను । తొలుగకడీ, నాశరముల । తూట్లుపడగ వైచెదాను ॥ని॥
వ॥ కౌరవాధములారా నిలువుడు మిమ్మిప్పుడేమి గావించెదనో చూడుడు.

దుర్యో॥ పోరడ పోపోరమాతో । బోరజాలవెంతకైన । మారణమాదువు నేడు । మాచేతను నిజముగాన ॥పో॥
వ॥ ఒరే బాలకా అభిమన్యా నేడు నీయాయువు మూడుటచే నిటకరుదెంచితివి బ్రతుకభ్రాంతియున్న తొలగిపొమ్ము.

అ॥ పాపాత్మా నీవెంతటి । బలవంతుడ వౌరనిన్ను । రూపుమాపుటకె వచ్చితి । కాపాడుకొ నీశిరమును ॥పా॥
వ॥ ఒరే పాపాత్మా యిదో నాశరంబుచే నీశిరంబు డుల్లవేయు

చుంటిని చూడుము. (అని శరంబును విడచిన దుర్యోధనుండు దానిం దప్పించుకొనును.)

దో॥ పిల్లడవురనీవు యింక । విల్లమ్ముల బట్టలేవు । ఒల్లిదులము మము గెల్వంగ । వల్లగాదు తెలియలేవు ॥ పి ॥

వ॥ ఒరే అభిమన్యా నీవింక బాలుడవు శరప్రయోగంబుల పద్ధతి నెరుంగవు వెడలిపొమ్ము.

అ॥ వృద్ధబ్రాహ్మణుండనీకు । బుద్ధిలేదు యించుకైన । యుద్ధమందు నిను గూల్చ వ్ర । సిద్ధివడతునెంతకైన ॥వృ॥

వ॥ ఛీ నీవు బ్రాహ్మణుండవుకావు చండాలుడవు కూడుగుడ్డ కాస పడినగుణహీనుండవు నీవనగా నాకొక లెక్కగాదు యిదో నా బాణంబులయొక్క రుచిం జూడుము. (అని బాణంబుల ప్రయోగించును)

కర్ణు॥ ఎంతవాడవౌరనీదు । వంతుబాపెదను చూడు । రంతులెల్లమాను మురా । రయమైపొయ్యెదవు నేడు ॥ఎం॥

వ॥ ఒరే బాలుడా నీవెవ్వరియెదుట యుద్ధమునకై నిలచితివో తెలిసి కొంటివా.

అ॥ తెలియకున్న వాడగాను । తెలివిహీనసూతపుత్ర । ఖలుడానిను(దుంచి నేను । గనెదకీర్తి సర్వత్ర ॥ తె॥

వ॥ ఒరే సూతపుత్రా నేనంతిమాత్రము దెలిసికొనకపోవుటకు నీ యంతటి తెలివిహీనుడనుగాదు. (యిదో నాభల్ల బాణం బును వైచితిని తప్పించుకొనుము అని తనభల్లంబున విసరిన కర్ణుండద్దానిని దప్పించుకొనును ఇంతలో)

సైం॥ బాలుండవు నీవటంచు । దూలించ పాపమంచు । యీలాగున యూర్కుంటిమి । యిదుగో నాబలముగాంచు ॥బా॥

వ॥ ఒరే యింతవరకు నిన్ను బాలుండని యూరకుంటిమిగాని యిక యూరకుండము యిదో నా ఘోరాస్త్రంబును వైచుచుంటిని తాళుకొనుము.

అ॥ చిక్కితివిర నాచేతను । యెక్కడికేగెదవింకను । దక్కవురా మతురబాద । ధవళాంగుని దటపుమికను ॥చి॥

వ॥ ఒరే నీచా యిదో నాగదాయుధంబున నీశిరంబును శకలీభూతంబుల గావింతును చూడుము (అని యిటు లనుచున్నంతలో నొకప్రక్కన ఘటోత్కచుండు ప్రవేశించి)

ఘటో - దరువు

అహోహో నేనిదె అసురమాయచే - అంబరవీధికి యరిగియుంటిని - కౌరవబలమును కన్నులజూచితి - గాలిదుమారము గప్పివైచితిని - మధ్యభాగమున మాపెదతండ్రిని - గాచుకనున్నరు నీచాధములును - రివ్వునవ్రాలితి ధర్మరాజుకడ - రెండుచేతులను దండముబెట్టితి - భుజవిక్రమమున లేవనెత్తితిని - భుజముపై నిడుక బొబ్బబెట్టితిని - రివ్వున మీదికి యెగిరితినిదః గో॥ రామారామా ॥

సం-వ॥ అని ఘటోత్కచుండు కౌరవులెల్లరు జూచుచుండగా ధర్మరాజును లేవనెత్తుకొని పైకెగసిపోవుచుండుటం గాంచి కౌరవయోధులు చెక్కిన విగ్రహములవలె నిశ్చేష్టితులై చూచుచుండుటయు అభిమన్యుండా వింతంజూచి తనమదిలో నేమనుకొనుచున్నాడన.

అ- గీ॥ యురుబలుడు నాదుయన్న ఘ । టోత్కచుండు
బుద్ధికుశలతతోడ మా । పెద్దతండ్రి
నెత్తుకొనిపోయె మేలంచు । నెంచినేను
వీరినెల్లను హతమార్తు । విడువకుండ ॥

వ॥ అహో మా పెదనాన్నగారిని మాఅన్నయగు ఘటోత్కచుండు సురక్షితముగా నెత్తుకపోయెను యిక నాకేమిభయము యీదుర్మార్గుల నందరిని క్షణములో చెండాడి వెడలిపోయెదగాక. (అని ప్రకాశముగా) ఒరే దుర్మార్గులారా (అని గదను రెండుచేతులతో ద్రిప్పుచు)

అభి—వృత్తము

రండురండు దుర్మార్గులారమీ । రణకౌశలమును జూపుడికఁ

దండిగదచె మీమస్తకములనే । ధరడొల్లంగను చేతునిక్క
పుండరీకమును యెదుగింపంగను । బోలగజాలున హరిణంబుల్
ఖండఖండలుగ జెండుదుటమ్ముల । గన్గొన దేవతగణమెల్ల ౯॥

వ॥ ఒరే కౌరవాధములారా మిమ్మిప్పు డేమిజేసెదనో చూడుడు (అని తనగదం ద్రిప్పుచు అభిమన్యుండు వీరవిహారము జేయుచున్నంతలో ద్రోణాచార్యు డదిగని తనవారితో నేమనుచున్నా డన)

ద్రో-గీ॥ బాలుడాకాడు వీడును । ప్రళయకాల
రుద్రునిగ దోచుచుండెను । రూఢిగాను
వీనిని జయించ మనలో నె । వ్వానికైన
వలనుపడకుండె నొకమాట । దెలుపువాడ.

వ॥ కర్ణాది వీరులారా వీడు బాలుడుగాడు మనపాలిటి కాలుడయ్యెను కావున మనమందర మేకమై వీని విల్లువిరచి విరథుంజేసి చంపినగాని జయించలేము.

దు-వ॥ ఔను అటులే జేయుదము (అని యంద రొక్క పెట్టున బాణప్రయోగంబులం జేసిన అభిమన్యుండు మహాకోపంబున)

అభి — దరువు.

ఒక్క పెట్టునను మీరందరునూ - కుక్కలవలె నెగబడ జొచ్చితిరా - వొక్కరొక్కరిని వధజేయుదురా - నిక్కంబిదియుట నిలచుండుడిరా - గదాదండమును చేతగొంటిరా - మదపుటేనుగుల మర్దించితిరా ॥రామారామా॥

వ॥ హా పరమేశ్వరా అని అభిమన్యుడు క్రిందబడుటం జూచి సైంధవుడు.

సైం-గీ॥ నాసుతుని జంపినట్టియా నరునిసుతుడు । వీని ప్రాణంబులతోనింక విడువరాదు । పంతమీడేర్చుకొందు నా కుంతమునను । బొడచి చంపెద ప్రాణంబు బోవునటుల ॥

వ॥ నాకుమారుని జంపి నాకు దుఃఖంబుగూర్చిన యీదుర్మార్గుం

డగు అర్జునుని కుమారుడగు నీసిం జంపినగాని నా దుఃఖము చల్లారదు (అని రక్తసిక్తాంగుడై పడియున్న అభిమన్యుని తన కుంతముతో బొడచి కాలుతో దన్ని పారిపోవును) ఇట్లుండ ఘటోత్కచుండు ధర్మరాజును సురక్షితముగా తమ శిబిరముం జేర్చి ద్రౌపదీ సుభద్ర లున్న చోటికేగి యేమనుచున్నాడన.

ఘు-వ॥ తల్లులారా మీపాదపద్మంబుల కిదే ప్రణామంబులాచ రించువాడను.

ద్రౌ-వ॥ కుమారా ఘటోత్కచా దీర్ఘాయుష్మంతుడవై వర్ధిల్లుము. కాని యెక్కడినుండి నీరాక.

ఘు-వ॥ రణాంగనమునుండి మా పెదనాయినగారిని యెత్తుకొని వచ్చితిని కాని తమ్ముడేడి.

సు-వ॥ వలదన్నను వినక పద్మవ్యూహంబును భేదించి పెదతండ్రిని విడిపించుకొని వచ్చెదనని పోయియుండెను.

ఘు-వ॥ వెంట నెవరైన యుండిరా.

ద్రౌ-వ॥ లేదు ఒక్కడే పోయియుండెను.

ఘు-వ॥ అయ్యో ఎంతమోసము (అని గదంగైకొని వెంటనే నట నుండి బైలు దేరివచ్చి అభిమన్యుండు మరణించిబడియుండుటం జూచి హా తమ్ముడా అభిమన్యా.

ఘటః - దరువు

తమ్ముయ్యా అభిమన్యా తమ్మి వ్యూహమున ప్రా - ణమ్ముల విడచితివా - అమ్మలు యీమాట నాలకించినచో జీ - వమ్ములు నిలువాగలవా ॥త॥ వీరాధివీరూడ ధీరులిందరునుండ - యీరీతిమరణింప నేలవ్రాసెనొబ్రహ్మ ॥త॥ అనుజా యీమాట నీజనకుండు వినియున్న - ఆత్మనేమని గుందునో - ఘనమశురాపురి శంకరునికైన నీపైన కరుణ గల్గకుండెనో ॥త॥

వ॥ ఒరే క్రూరాత్ములారా కౌరవపశువులారా ఎందుంటిరి ఎందు

దాగితిరి నాకంటబడిన మిమ్మందరి నొక్క-పెట్టున నాగదాదండంబున కావులితిగొనక విడచిపెట్టుదునా. హా తమ్ముడా అభిమన్యూ అభిమన్యూ (అని అభిమన్యునిపై బడి కొంతవరకు దుఃఖించి అటనుండి లేచివచ్చి పాండవాదుల కడకుం జేరి)

ధ-వ॥ కుమారా ఘటోత్క-చా ఏమట్లు దుఃఖించుచుంటివి.

అ-వ॥ అభిమన్యుడేడి.

ఘ-సీ॥ తల్లిదండ్రులార । తమ్ముని సంగతి
యెటుల విన్నవింతు । నేమిసేతు
దురమునందు యట్టి । దుష్టాత్ములందరు
ప్రాణములను గొనిరి । పాపమనన ॥

వ॥ ఆదుర్మార్గులెల్లరు తమ్ముని యొంటిగాజిక్కించుకొని యొక్క-పెట్టున బాణవర్షమును గురిపించి చంపియుండిరి.

సు-అ-వ॥ హా కుమారా యని మూర్ఛిల్లుదురు.

ఘ-వ॥ నేబోవుసరికి ఆదుర్మార్గులెల్లరు శిబిరములకు బారిపోయియుండిరి లేకుండిన నాతమ్ముని జంపినపగను దీర్చుకుందును.

భీ-వ॥ ఒరే పిరికిపందా

గీ॥ పారిపోయిరటంచును । బలికెదేల
శిబిరముల జొచ్చుకొనిపోయి । శిఖలుబట్టి
యీడ్చుకొనిరాకపోతివా । హీనబలుడ
నేనెయుండిన యెటులౌను । నింతపనియు ॥

వ॥ నీవా శిబిరములను జించివైచి యాకౌరవపశువులను చిత్రవధ గావించకపోతివా. భయపడితివా నిన్నేమనవలయును.

ఘ-వ॥ ఔను భయపడితిని. ఎందులకన

సీ॥ భీతినొందితినేను । పెదతండ్రికున్నట్టి
ధర్మలోభత్వంబు । తగ దలంచి

భీతినొందితి నేను । పినతండ్రి కర్ణుని
వధియింతుననుమాట । నెదదలంచి
భీతినొందితి నేను । పాతకుండగు సుయో
ధనునీవు దున్రించు పన్రి । తినదలంచి
భీతినొందితి నేను । ఘాతజేయుగ గురుఁ
దున్రిపదాత్మజుని పంత । మపుడుదలచి

గీ॥ కానిలేకున్న నే లయ । కాలునట్లు
భీకరాకారముందాల్చి । భీతిలేక
తమ్ముని౯ జంపినట్టియా । తామసులను
మన్నులోఁబూడ్చకుందునా । కన్నతండ్రి.

వ॥ అంతేకాని బలములేక కాదు.

ధర్మ-వ॥ ఔను నాయనా నీవన్నమాట యదార్థము.

కృ-వ॥ బావా ఒభిమన్యుండు వీరస్వర్గమునొందెను విచారింప వలదు.

భీమ—వృత్తము.

ఒక్కబాలకు నుండజూచియు
నొప్పు మెప్పు దలంచక౯
పెక్కు దుర్మార్గులును జేరియు
భీతిలేకను బాణముల్
యెక్కుబెట్టియు జంపిరిక నే
నేమనందును వారల౯
స్రుక్కడంచక నున్న భీమ
సేననాముడ గానిక౯॥

వ॥ ఓ చండాలురలారా మాయభిమన్యు నొక్కనిపై పెక్కురు విరగబడి విగతజీవుని గావించితిరా మిమ్మందర నేనొక్కరుండనే మీ తలలను నేల డుల్లజేయుకుండినచో నేనుభీమసేనుండనుగాను.

అ-వ॥ కుమారా ఘటోత్కజా మమ్ములను బాబు పడియున్న చోటికి గొనిపొమ్ము.

ఘు-వ॥ సరే రండు (అని అందరిని అభిమన్యుడు పడియున్న చోటికి దోడుకొని పోవును) ఆగండి అల్లరిజేయకుడి యింకా నాతమ్మునికి ప్రాణ మున్నట్లుగా తోచుచున్నది.

అ-వ॥ ఆ- ఏదీ నన్నొకసారి నాబంగారుతండ్రిని కన్నులారజూడ నిమ్ము. (అని అభిమన్యునిదగ్గరకు బోయినంతలో)

అభి-వ॥ తండ్రి తండ్రి సైంధవుడు (అని ప్రాణములు విడచును)

అర్జు-వ॥ ఏమీ సైంధవుడా.

ఘు-వ॥ ఔను మరచిపోతిని. ఆదుర్మార్గుడగు సైంధవుడు తమ్ముడు పడిపోయినదిజూచి కుంతముతో బొడచి తమ్ముని నెత్తిపై కాలుతో దన్ని వెడలిపోయెనట. యీమాట సారధియగు సుశర్మ నాతో జెప్పియుండెను.

అ-వ॥ ఒరే చండాలా సైంధవా.

ఉ॥ చూడుడి రేపుసైంధవుని । సూర్యుడు గ్రుంకకమున్నె నేను నా । వాడిమిగల్ల యస్త్రముల । వానితలం దెగవేయకున్న నే । క్రీడిని గాను నిక్కమిది । కృష్ణునకేనుసఖుండగాను నే । నాడినమాటదప్పినచొ । నగ్నిప్రవేశము జేతునిక్కముగ్ ॥

కృ-వ॥ ఆ- ఆ అర్జునా ఎంతఘోరశపథముగావించితివి నిన్నేమన వలయును.

భీ-వ॥ ఔను. ఆ శపథము గొనసాగించుపని మనది. (ఇంతలో ఉత్తర సురుకుచువచ్చి అభిమన్యునిపై బడి)

ఉత్తర - దర్వు

అహో ప్రాణేశనీవు యెరిగితివా నన్నువిడచి । మోహనాకారనా దుముద్దు జెల్లింతురెవరు ॥ఆ॥ నినుబాసియుర్విలోన నిలువనేర్తు నేటు వలెను । మనజాలను నీతోడను జనుదెంచెద బిలువునన్ను ॥ ఆ ॥ మన వివాహమయ్యి పెక్క । దినములైన గడువలేదు । మనసిచ్చియు నీతో నొక । మాటైనను బలుకలేదు ॥ఆ॥ యింతలోనె మనకునిటుల । యెడ

బాటు గలుగజేసె । యెంతకైన మశురబాద యీశుని కరుణయుమాసె॥

సీ॥ మనయొక్క పెండ్లికి । ఘనవైభవంబొప్ప
వేసిన పందిళ్లు । విప్ప లేదు
ప్రేమతోడుత మన । పెండ్లికివచ్చిన
చుట్టములు మరలిపో । జూడలేదు
మనపెండ్లి వేళ బ్రా । హ్మణులు జదివిన వేద
మంత్రములు మదిలోన । మరువలేదు
మన పెండ్లి వేళల । మనముదాల్చిన పట్టు
వస్త్రంబులకు వన్ను । వదలలేదు

గీ॥ సిగ్గువిడనాడి నేనుసీ । దగ్గరికిని
జేరిముఖమెత్తి యొకనాడు । చెలువముగను
మాటలాడైన నెరుగ నా । మనసుదీర
కలకటా యెంతపడిజేసె । కమలభవుడు ॥

వ॥ అయ్యో ప్రాణేశ్వరా ప్రాణేశ్వరా,

దా- వ॥ బిడ్డా యిట్లుదుఃఖించిన ప్రయోజనమేమున్నది. నీ గర్భస్థశిశువే మనకందరికి జీవాధారము.

కృ-వ॥ ఘటోత్కచా వీరినందరిని శిబిరములకుం జేర్చుము. ఫల్గునునితోగూడ నేనేగి అభిమన్యునకు దహనసంస్కారముల నొనరింపజేసివచ్చెదను. (అసన వారందరిని ఘటోత్కచుండు శిబిరములకుం దోడ్కొనిపోవుటయు నంత నక్కడ)

దుస్సల ప్రవేశము

దరువు॥ దుర్యోధను చెల్లెలాను । దుస్సలయనుదాన నేను । శౌర్య ధైర్యసాహసుండు । సైంధవుండునా మొగండు ॥ దు ॥ చక్కదమునందు రతిని । ధిక్కరించుదాన నేను । మక్కువతో సాటివారి మన్ననలను నంది నాను ॥ దు ॥ కరమొప్పగనాదుదాసి । కాంతలెల్ల గొలువగాను । ధరణి మశురబాదపౌరి । హరుని మదినిదలచెద్దాను ॥

మాటలు॥ ధృతరాష్ట్రుని కుమార్తెను దుర్యోధనుని చెల్లెలను సింధుదేశాధీశ్వరుండగు సైంధవరాజుగాని యిల్లాలను మన్నామంబు దుస్సలయని యని యనదుర్షు నారీ విన కోరి.

దు-వ॥ చెలీ నా ప్రాణేశ్వరుడింతవరకు రాడాయెనుగదా నా కుడికన్నదరుచున్న దదెందులకో.

చె-వ॥ అమ్మా నీవెప్పుడిటువంటి దుశ్శకునములే గలుగుచుండెనని చెప్పుచుందువు (అని యిటులనుచున్నంతలో సైంధవుడరుదెంచినం జూచి)

దుస్స-వ॥ ప్రాణేశ్వరా మీపాదంబుల కిదే ప్రణామంబులాచరించుచుంటిని.

సైం-వ॥ ప్రాణేశ్వరీ చల్లగా వర్ధిల్లుము.

వాదం - దరువు

సైం॥ ఇంతీ నీపంతము నే । నీడేర్చియు వచ్చినాడ ॥నీ॥
దంతీగమనా రోనా । ధైర్యము గనబరచినాడ ॥ఇం॥
వ॥ ప్రేయసీ సుభద్రతో నీవాడినమాట నేడు జెల్లించివచ్చితిని. యిప్పుడుగదా మనయాత్మలు శాంతినొందినవి.

దుస్స॥ మెచ్చుకొంటి నిన్నిప్పుడు । మేదినీశ మదిలోపల ॥మే॥
హెచ్చుబలవంతుడావు । యెటుదుంచితి వనిలోపల॥హె॥
వ॥ మనోహరా నీబలము నేనెరుగనాకాని ఆ అభిమన్యుని యెట్లు దుంచితివో తెల్పి నాకానందము గావింపుము.

సైం॥ మోహనాంగి గురుడుపద్మ । వ్యూహంబును బన్నె నేడు ॥వ్యూ॥
సాహసమున వాడురాగ । జంపివేసినాడచూడు ॥మో॥
వ॥ నేడు ద్రోణాచార్యులవారు పద్మవ్యూహమునుబన్నియుండెను ఆ పోరడందు అడుగుబెట్టనో లేదో అబ్బా వాడు జూపిన పరాక్రమమే మనవలయును. వానిని జూచినంతమాత్రమున.

గీ॥ వెన్నుజూపిరి నీరొక్క । యన్నలంత
ముదుకడగు ద్రోణుడును తోక । ముడచుకొనియె
సూతపుత్రుండు నొకచోట । భీతిదాగె
సైన్యమంతయు బారిరి । సర్వదిశల ॥

వ॥ వింటివా అప్పుడు నేనొక్కడనే వానింజంపితిని.

దుస్స॥ అట్టిబాలవీరుని నీ । వెట్టులవధియించితివో కా ॥యె॥
గట్టిగ నామదినిమమ్మ । గాజాలను తెల్పుమికా ॥అ॥
వ॥ సరే అట్టి యాబాలవీరుని నీవెట్లు జంపియుంటివో

తెల్పుము ముఖాముఖి యుద్ధముజేసి జంపితివని నేనుమాత్రం నమ్మజాలకున్నదానను.

సైం॥ యింతివినవె యాబాలుడు । యేమరుపాటుననుండగ ॥యే॥
కుంతమునను బొడచిజీవి । గొంటినినే వినుబాగ ॥యిం॥
వ॥ దుస్సలా వాడు యేమరుపాటున నున్నప్పుడు యిదే మంచి సమయమని ధైర్యంబవలంబించి కుంతముతో బొడిచి చంపి వచ్చితిని.

దు॥ సరెసరె నీసాహసముకు । సంతోషించితి నేను ॥సం॥
ధరణీమశుర బాదపొరి । హరునీగొనియాడెదాను ॥సం॥
వ॥ ప్రాణేశ్వరా నీసాహసంబునకును చాతుర్యంబునకు మిక్కిలి సంతోషించితిని (అని యిటులనుచున్నంతలో నొక భటు డరుదెంచి)

భ-వ॥ మహారాజా నమస్కారములు
సైం-వ॥ ఏమి సమాచారము.
భ-వ॥ మిమ్ములా అర్జునుడు.
దుస్స-వ॥ అనుమానమేమి ఆసంగతేదో చక్కగా దెల్పుము.

భ-సీ॥ అరివీరులందను । నమన్యు నెదిరించి
విరథుని గావించి । విల్లు దునిమి
శితశరంబుల రక్త । సిక్తాంగునిగజేసి
పరగనాతడు భూమి । బడగజూచి
యిప్పుడో నప్పుడో । విడచుప్రాణంబని
ద్రోణాదివీరులు । త్రోవబట్టి
మరలి రాగనుజూచి । మరినీమగండును
కుంతంబుతోడనా । కుంతిపౌత్రు
గీ॥ బొడచితలపైని దన్నియు । వెడలివచ్చె
అట్టిసంగతి విజయుండు । నాలకించి
కోపమున ప్రతిజ్ఞను బూనె । నీపతినిక
రేపురవిగ్రుంకను మున్న । రూపుమాపు ॥

వ॥ అట్లు సైంధవుని జంపకుంటినేని ధనుర్బాణంబులతో సహా అగ్నిప్రవేశము గావింతునని ఆయర్జునుండు ప్రతిజ్ఞంబూనెను. ఇది నేగొని వచ్చిన సమాచారము.

సైం-వ॥ ఛీ వట్టిమాట.

దుస్స-వ॥ వట్టిమాటగాదు గట్టిమాటే హా పరమేశ్వరా యివుడెట్లుజేయవలెను. నాప్రాణేశ్వరుని రక్షించువారెవరు.

సైం-వ॥ సఖి యేల యిట్లు భయపడుచుంటివి.

సీ॥ పగవారినాజిలో । బడగొట్టువారలౌ
హాఃభీకరులను నీ । యన్నలుండ
చండప్రచండుల । జెండాడు సంతటి
ధీరవంతుండు రా । ధేయుడుండ
పురహరుసైన సం । గరమందు నోడింప
జాలిన యట్టి యా । చార్యుడుండ
మాయమంత్రముబన్ని । మశిబూసి పంపెటి
చతురత గల్ల యా । శకునియుండ

గీ॥ యిందరుండియు నన్ను ద । ప్పింపలేర
పార్థుడే యగ్నిలోబడి । ప్రాణమిడచు
యతడు జచ్చినతోడనే । యతనివారు
మరణమాదురు చింతేల । మధురవాణి.

వ॥ కావున నేనిప్పుడేపోయి యా దుర్యోధనాదుల కీసంగతి నెరిగించి యుపాయ మాలోచించెదను. (అని అటనుండి వెడలివచ్చుచు మరల తన మదిలో) నేను దుస్సలకుమాత్రము భయపడకుమని ధైర్యోక్తులాడితినిగాని. పార్థుడు సర్వసమర్థుడు తనప్రతిన విడచునా హా పరమేశ్వరా నన్నెవరు రక్షించగలరు (అని వచ్చుచున్నంతలో దుర్యోధనాదు లెదురేగి)

దుర్యో-వ॥ బావా యేమట్లు ముఖము చిన్నబోయి యుంటివి భయపడకుము. అదో కర్ణద్రోణులుగూడ వచ్చుచుండిరి.

## వాదం - దర్వు

దు॥ భయము జెందు టేలనయ్యా । బావా నీమదిలోపల ॥బా॥
జయమే చేకూరు మనకు । సందేహము జెందు టేల ॥భ॥
వ॥ బావా నీభయకారణము మేమెరుగక పోలేదు నిన్నుగాపాడు టకు మేమందరము లేమా.

సైం॥ సామాన్యుడు గాడతండు । సవ్యసాచి ప్రతినవిడడు ॥స॥
నామదికెటు దోచకుండె । నాకిప్పుడు మీరెతోడు ॥సా॥
వ॥ ఆ ధనంజయుడు పట్టిన పట్టువిడచు వాడు కాడు. నా కన్నిటికి మీరేతోడు మిమ్ములనే నమ్ముకొని యున్నవాడను. మీ చెల్లెలి ముఖమైనజూచి నన్ను కాపాడుడు.

ద్రో॥ చక్రవ్యూహంబుబన్ని । చక్కగనినురక్షించెద ॥చ॥
సంక్రందనసుతుడు నిన్ను । జంపునెటులనో జూచెద ॥చ॥
వ॥ సింధురాజా నీ వెందుకు భయపడెదవు చక్రవ్యూహంబు బన్ని నిన్ను రక్షించెదను. నామాటనమ్ముము.

క॥ వ్యూహమధ్యమందున ని । న్నుంచియు మేమందరాము ॥నుం॥
సాహసంబు జెడకుండగ । సంరక్షణ జేసెదాము ॥వ్యూ॥
వ॥ జయద్రథా వ్యూహ మధ్యమందు నిన్నుంచి మేమందరము మొనలయందు నిలిచి నిన్ను రక్షించెదము.

దు॥ సకల సైన్యమును నేను । చక్కగనట నిల్పెదాను ॥చ॥
ప్రకటితముగ మశురబాజ । పార్వతిపతి మెచ్చగాను ॥స॥

సం-వ॥ అనియిటుల ద్రోణాచార్యుండు చక్రవ్యూహంబు రచించి వ్యూహమధ్యంబున సైంధవున్ని నునిచి కర్ణదుశ్శాసనాది యోధులను మొనలయందు నిలిపియున్నంతలో కృష్ణార్జునులు భీముడు ప్రవేశము.

కృ-వ॥ భీమార్జునులారా ధనురాచార్యుని చక్రవ్యూహ రచనను జూచితిరా.

భీ-వ॥ ఔను నేను వ్యూహమును భేదించెదను మీరు నా వెనుక నుండి జొచ్చుకొని రండు.

కృ-వ॥ ఔను అటులే జేయుము.

భీముని దర్వు

కనుగొనుడికనా కడుభుజబలమును । ఘనతరమగు యీగదచే బూనియు । చక్రివ్యూహమును చెదరగొట్టితిని । విక్రమ మొప్పగ కౌరవ వీరుల । మొర్రోయనగను మోదిచంపితిని । రథగజాశ్వముల రయము జేసితిని । సూతపుత్రుని భీతిలజేసితి । ద్రోణాచార్యుని దొలగజేసితిని ॥ రామా రామా ॥

సం-వ॥ అని భీమసేనుండొక పరాక్రమన వీరవిహారంబు సల్పుచు కౌరవసైన్యంబును హతమార్చుచున్నంతలో కృష్ణార్జునులు చక్ర వ్యూహంబున జొచ్చి బాణవర్షంబును గురిపించుచుండుటంజూచి కర్ణుం డడ్డువచ్చి యేమనుచున్నాడన.

వాదం - దర్వు

క॥ ఓరివిజయునిల్వర । యెటు । దూరివచ్చెదావురా । ఘోరశస్త్రధార నిన్ను జీరివేసెదానురా ॥ఓ॥
వ॥ ఒరే పాండవమధ్యమా నిల్వుము నన్ను గెలిచి ముందడుగు వేయుము.

అ॥ పోరా నీవెంతర । నీ । పొగరణంతుచూడరా । నారాచంబులనిన్ను । నాయాసము జేతునిపుడె ॥పో॥
వ॥ ఒరే కర్ణా తొలగిపొమ్ము లేదేని ముందు నీశిరంబు దుంచి పిమ్మట సైంధవుని శిరంబు ఖండించెదను.

కృ॥ తడవుజేయబోకుమ । నీ । కడుబలంబు జూపుమా । విడువుము సమ్మోహనాస్త్ర । వితతిచింత గొనకుమా ॥త॥
వ॥ అర్జునా సమ్మోహనాస్త్రమును ప్రయోగించి వీరి నెల్లర

మూర్ఛపడవేయుము. ఆలస్యముజేయకుము (అనిన అర్జును
డట్లేగావించి కృష్ణునిజూచి)

అ॥ పొద్దుగుంకవచ్చెను । నా । కెద్దిదోచకుండెనూ । యద్దుర్మార్గుడు
సైంధవు । డగుపడడెటు దాగెనూ ॥ప్రొ॥

వ॥ కృష్ణా ప్రొద్దుగ్రుంకుట కేమాత్రము తడవులేదు ఆ దుర్మార్గు
డగు సైంధవు డేడదాగెనో కాని కానరాడయ్యెను,

కృ॥ విడువుము మేఘాస్త్రము । విను । వీధికినిక వేగమూ । కడువేగమె
సూర్యుడునగు । పడకుండగజేయుమూ ॥వి॥

వ॥ అర్జునా వెంటనే మేఘాస్త్రమును సంధించి వినువీధికి ప్రయో
గించి సూర్యుని గప్పివేసినచో ఆదుర్మార్గుడు ప్రకటమగును.
(అనిన అర్జునుం డట్లు గావించుటయు నంత చీకటిపడినట్లగుటం
జేసి కౌరవసేనలు సంతోషంబున కేకలువేయ నారంభించ
సైంధవుడు బ్రతికితినని సంతోషంబున తలెత్తి చూచుటయు
నంత కృష్ణుండు అర్జునునితో) అర్జునా చూచుచుంటివేల
అదో సైంధవుడు నీవు బాణం బెక్కుబెట్టి వాని శిరం
బాకాశంబున నాడునట్లు గావింపుము.

అ॥ పటుబాణము బట్టితి । నే । నటువలెనే గొట్టితీ । దిటమతితో మశుర
బాద । నిటలాక్షుని నమ్మితీ ॥అ॥

వ॥ కృష్ణా ఇదో బాణంబెక్కుబెట్టి సైంధవుని తలను ఎగురగొట్టి
తిని చూడుము.

కృ-వ॥ శబాస్ విజయా నీప్రతిజ్ఞ నెరవేరెను కాని వాని శిరం
బును భూమిపై బడినచో నీవుమరణింతువు. అట్టి వరంబు వానికున్నది
కావున అట్టి శిరంబు బృహక్షేత్రమున తపంబు గావించుచున్న వాని
తండ్రి దోసిటిలో బడునట్లు జేయుము.

అ- గీ॥ చక్కగా మారుతాస్త్రంబు । నెక్కుబెట్టి
వాని శిరమును యిప్పుడే । వానితండ్రి

చేతిలో బడునట్లుగా । జేయువాడ
గాంచుమిదె ద్వారకాధీశ । కలుషనాశ ॥

సం-వ॥ అని అట్లుగావించి విజయోత్సాహంబున కృష్ణార్జునులు శిబిరంబునకు జేరవచ్చిరంత.

—( మంగళహారతి )—

శ్రీకైలాస నివాసమహేశా శ్రితజనరక్షక హారతిదో । నాకాధిప వందితసర్వేశ త్రినయనాజయశుభ హారతిదో ॥శ్రీ॥ శూలహస్త కరుణాల వాలముని । లోలాజయజయ హారతిదో । బాలచంద్రధర పార్వతీరమణ । కాలకంధరా హారతిదో ॥శ్రీ॥ భోగిభూషణా బుధజనపూజిత । రాగద్వేష హార హారతిదో । భాగదాసకవిపాలక శంభో । పశుపతిజయశుభ హారతిదో ॥శ్రీ॥

—( గద్య )—

ఇది వైశ్యకుల పారావార సుధాకర పునిగాశిల గోత్రోద్భవ
చెర్విరాల వీరన్న రాజమాంబా గర్భ తనూభవ
కవితావైభవ నానావిధ యక్షగాన ప్రబంధ
రచన భాగధేయ భాగయ్య నామ
ధేయ ప్రణీతంబైన
పద్మవ్యూహము
సంపూర్ణము.

కొండా శంకరయ్యగారి శ్రీమియర్ పవర్ ప్రెస్, సికింద్రాబాద్.